# జీవితంలో గెలవండి

## - విధ్యార్ధుల కోసం

మొదటి ముద్రణ :
2015 ఆగష్టు 2000 కాపీలు

వెల : 80/-



రచయిత : చింతలపూడి. కరుణానిధి
M.Sc (Psychology), PG Diploma Journalism & Mass Communication,
B.Ed,(Certificate in Child Psychology, PG Diploma Guidance & counselling),
కనిగిరి





ప్రతులు అన్ని పుస్తకాల షాపులలో దొరుకును

పాఠశాల విద్యార్ధులకు రాయితి పై పుస్తకం ఇవ్వబడును.

డి.టి.పి & ప్రింటింగ్
కీర్తన గ్రాఫిక్స్
జలీల్ వీధి, పాత వినోధ థియోటర్ ,
న్యూ సోనోవిజన్ ప్రక్కన, అరండల్ పేట
విజయవాడ - 520 002
సెల్ : 8096268695, 9951625059

## రచయిత గురించి

నా పేరు చింతలపూడి కరుణానిధి, మా నాన్నగారి పేరు వెంకట్రావుగారు, మాతల్లి పద్మావతి గారు,ప్రకాశంజిల్లా, కనిగిరి నందు1985, జనవరి11వ తేదిన జన్మించాను.అక్క విజయలక్ష్మి పండిట్, తమ్ముడు కరుణాసాగర్, బావగారు వీరయ్య.

ఈ పుస్తకం రచనలో నాకు ఎంతగానో సహకరించిన నా భార్య "నవ్యభారతి" నా రచనల సమయంలో నాకు ఎంతగాన్నో ప్రేరణ కలిగించిన నా కుమార్తె "శ్రీపాద" (బంగారుతల్లి) వీరందరి సహకారంలో ఈ పుస్తకాన్ని రాయటం జరిగింది.

ఈ పుస్తకం రాయటంలో అనుక్షణం నాలో ఆలోచనలు నింపి, విధ్యార్ధులకు ఉపయోగపడే ప్రతి విషయాన్ని నాద్వారా రాయించిన నా దైవం శ్రీపాద శ్రీవల్లభులకు ఈ పుస్తకాన్ని అంకితం చేస్తున్నాను.

దత్తాత్రేయ అవతారాలలో శ్రీ పాదశ్రీవల్లభులది మొదటి అవతారం, స్వామి వారు తూర్పుగోధావరి జిల్లా పిఠాపురంలో జన్మించి కర్ణాటక రాష్ట్రం రాయచుర్ తాలుకాలో కురవపురం వద్ద తప్పుచేసి కృష్ణానదిలో అంతర్ధ్యానం అయ్యాడు, అని ప్రతీతి ఈ స్వామి వారి చరిత్ర అయిన శ్రీ పాద శ్రీ వల్లభుల చరితామృతం చదవటం ద్వారా అందరికి విద్యాబుద్ధులు అందుతాయని నా ప్రగాడ నమ్మకం.





నా జీవితంలో మరచిపోలేని వ్యక్తులు యాచక వృత్తి చేస్తూ కాశినాయన గుడిని కనిగిరిలో కట్టించటంలో ప్రధాన పాత్ర పోషించినా ముంతస్వామి వారిని, నా స్నేహితులైనా, కాశిరాజు, అనిల్,రమేష్, నారాయణ, సుబ్బు, వెంకటేశ్వర్లు, కాశిరెడ్డి,నరేష్‌లు ప్రత్యేక వ్యక్తియైన నరసింహరావు అనేక విషయాలు తెలియజేసిన కామకోటి నన్ను ఎన్నటికి మరువని నా సూడెంట్స్ రేవతి,స్వాతి,గాయిత్రి, పరమేశ్వర్,శ్రీను, ప్రసాద్‌లు ఇంక అనేక మంది మిత్రుబృందాలతో అందరికి మంచి జరగాలని కోరుకుంటున్నాను.



# పుస్తక పరిచయం

సాధారణంగా మనలోచాలా మంది ఒక క్రొత్త పుస్తకాన్ని చదవటం ప్రారంభించినప్పుడు ఈ పుస్తకాన్ని మొత్తం చదవాలి అని అనుకుంటారు. పుస్తకం తెరచి చదవటం ప్రారంభించిన తరువాత 4-5 పేజీలు చదివిన తరువాత చదువుదాంలే అని అనుకొని ఇక ఆ పుస్తకాన్ని ఒకటి, రెండు సంవత్సరాల వరకు తెరవరు. ఏదో ఒక రోజు ఇంట్లో పుస్తకాలని సర్దుతూ ఉంటే ఆ పుస్తకం కనపడితే మరళా చదవటం ప్రారంభిస్తారు. ఈ పుస్తకాన్ని ఖచ్చితంగా ఈసారి పూర్తి చేయాలని అనుకొని 4-5 పేజీలు చదివి మరల ప్రక్కన పడేస్తారు. ఇప్పటి విద్యార్థులకు పుస్తకాలు చదివే ఓపిక తక్కువే అని చెప్పాలి. ఒక మంచి సంకల్పంతో రచించిన ఈ పుస్తకానికి అటువంటి పరిస్థితి రాకూడదన్న ఉద్ధేశంలో సాధ్యమయినంత వరకు తక్కువ పేజీలతో తక్కువ ధరలో రూపొదించడం జరిగింది. ఈ పుస్తకంలోని ప్రతి విషయం విద్యార్థులపైన, వారి తల్లిదండ్రులపైన, ఉపాధ్యయులపైన, సమాజంలోని వివిధ అంశాలపైన ఆధ్యయనం చేసి, పెద్దల అనుభవాలు పరిగణలోనికి తీసుకొని రాయటం జరిగింది. ఈ పుస్తకం విద్యార్థుల పాలిట గొప్ప వరంగా ఉంటుందని భావిస్తున్నాను. ఈ పుస్తకాన్ని చదివి అనుసరించటం ద్వార విద్యార్థుల్లో క్రమ శిక్షణ ఆత్మవిశ్వాసం, నాయకత్వం లక్షణాలతో పాటు ఉన్న లక్ష్యాలను ఏర్పరచుకొని శక్తి వంతంగా మారుతారని అనడంలో ఏమాత్రం సందేహం లేదు. ఈ





పుస్తకం ప్రతి విద్యార్థికి ఒక స్నేహితుడిలా, తండ్రిలా, గురువులా, జీవితంలో ఒక భాగంగా ఉండగలదు. విద్యార్థులకు వచ్చే కష్టాలు, బాధలు, దు:ఖాలు ఇంకా అనేక మానసిక సమస్యలను తరిమిగొట్టి ఎన్ని ఇబ్బందులు వచ్చిన, లక్ష్య నష్టాలు, లక్ష్యనిందలు మీ మీద పడినా మిమ్మల్ని మానసికంగా, శారీరకంగా, సామజికంగా హిమాలయాలంత ఉన్నత శిఖరాలను చేరుస్తుంది. అనటంలో సందేహం ఏమాత్రం ఉండదు. ఈ పుస్తకంలోని ప్రతి పేజీని ప్రతి విషయాన్ని మనస్సు పెట్టి చక్కగా చదివి మీ తల్లిదండ్రులకు, మీ ఊరికి ఈ దేశానికి గొప్ప పేరు తీసుకువస్తారని ఆశిస్తున్నాం. పుస్తకంలో ఏమైన తప్పులు ఉంటే తదుపరి ముద్రణలో సరిచేస్తాం అని తెలియచేస్తున్నాం.



# స్వామి వివేకనంద



మీ జీవితంలో ఒక్కరోజైనా సరే స్వామి వివేకనంద గురించి తెలుసు కోండి.ఆయన గురించి తెలుసుకోవడం వల్ల మీ జీవితం,మీ కుటుంబం, మీ వంశము ధన్యులు అవుతారు.ఈ ప్రపంచంలో ఎవ్వరూ ఇవ్వలేనంత ఆత్మ విశ్వాసాన్ని,దృఢ సంకల్పాన్ని ఆయన మాత్రమే ఇవ్వగలడు.స్వామీజి గురించి మీరు పూర్తిగా తెలుసుకుంటే మీరు ప్రపంచ విజేతలు అవటంలో ఏమాత్రం సందేహం ఉండదు. మనలోని పిరిక తనాన్ని,మన చేతగానితనాన్ని,మన ధౌర్భాగ్యాన్ని క్షణంలోనే మాయం చేయగల శక్తి స్వామిజికి మాత్రమే ఉంది. ఇది సత్యం.





# సుభాష్ చంద్రబోష్



ఒక పనిని మనం చేయాలంటే, ఆపనిని జయించాలంటే ఆపనిపై మనకు అపారమైన నమ్మకం ఉండాలి. మనం చెయ్యాలి అనుకున్న పనికి ఎన్ని అటంకాలు ఎదురైనా వాటిని ఎదురించి భగభగమండే సూర్యుడిలా వెలిగిపోవాలి. ఈ ప్రపంచాన్నే ఎదిరించాలి. ఒంటరిగా పోరాటం చేయవలసి వస్తే శత్రువులనే తన సైన్యంగా మార్చగలగాలి. హిమాలమాలంత మనస్సు,అగ్ని పర్వతంలాంటి ఆవేశం, ప్రపంచాన్ని ఒక్క చేత్తో జయిస్తాననే ఆత్మ విశ్వాసం ఎవరికైనా ఉన్నాయంటే అవి సుభాష్ చంద్రబోష్‌కే సాధ్యం. మీ జీవితంలో ఒక్కసారైనా సుభాష్ చంద్రబోష్‌ని గురించి తెలుసుకోండి. నిజమైన దేశభక్తి నిలువెల్లా కనిపిస్తుంది.

## విషయా సూచిక

## ఓ యువత మేలుకో

భారత మాత గర్భాన జన్మించిన వీర పుత్రులారా, భరత మాత మిమ్మల్ని పిలుస్తుంది, ప్రపంచానికి జ్ఞానాన్ని, ధర్మాన్ని, రక్షణను ఇచ్చిన భరతమాత నేడు ఎక్కడ చూసినా దారిద్ర్యం, ఆకలి బాధలు, అనారోగ్యం, దోపిడీ, దొంగతనాలతో అతలాకుతలమౌతుంది. సగటు మనిషి జీవించటానికి భద్రత కరువు అవుతుంది. పరాయి పాలన నుండి విముక్తి కలిగినా, స్వతంత్ర దేశంగా ఆవిర్భవించినా, సగటు మనిషి జీవన ప్రమాణాలు పెరగలేదు. దేశ పంచవర్ష ప్రణాళిల్లో బడ్జెట్‌లు పెరుగుతున్నాయిగాని మనిషికి కావలసిన కనీస సదుపాయాలు లభించటం లేదు. నేటికీ దేశంలో అధునాతన వైద్యం వచ్చినా, ప్రభుత్వం కోట్ల రూపాయలు ఖర్చు చేసి వైద్యసేవలు ఉచితంగా అందించినా నాణ్యత లేక పోవటంలో మనిషికి ఆరోగ్య భద్రత కరువు అవుతుంది. కొన్ని వేల కోట్ల రూపాయిలు ఖర్చుచేసి ప్రభుత్వ పాఠశాలలు స్థాపించినా విధ్యా ప్రమాణాలు మాత్రం శూన్యంగానే ఉన్నాయి. ఈ విధంగా ప్రతిరంగంలో నాణ్యత ప్రమాణాలు లోపించి, కార్పోరేట్ వైద్యం, కార్పోరేట్ విధ్యలకు చేయూత నిస్తున్నారు. మధ్యతరగతి, పేదవాడి విధ్యా,వైద్యాన్ని గాలికివదిలేసారనే చెప్పాలి అంతే కాకుండా ప్రజలను బలహీనులుగా చేసే ఆరోగ్యాన్ని పాడుచేసే, మధ్యపానాన్ని అధికంగా అమ్మడం, ప్రజల జీవితాన్నీ ఫణంగా పెట్టి రాజకీయం చేస్తున్నారు.





రాజకీయాలలో నైతిక విలువలు లోపించిన వ్యక్తులను ప్రోత్సహించి ప్రజాస్వామ్యానే అపహస్యపాలు చేస్తున్నారు. అది ఇది అని లేకుండా ఏ రంగంలో చూసినా అవినీతి పేరుకొనిపోయింది. ఇటువంటి విధానానికి స్వస్థీపలికి భారతదేశం అవినీతి రహిత దేశంగా, ప్రపంచదేశాలకు శాంతిని,జ్ఞానాన్ని బోధించే ఆదర్శప్రాయదేశంగా మారలంటే, విద్యార్థి ధశనుంచే సంస్కృతి, సాంప్రదాయాలను పాటిస్తూ, నైతిక విలువలతో జీవించాలి.కలుషితమైన సమజాన్ని ప్రక్షాలన చేసే విధంగా తయారవ్వాలి. అలా చెయ్యాలంటే విద్యార్థి,యువత మన మనస్సుల్లో నాటుకు పోయిన మలినాలను తొలగించి సింహపు గర్జనలతో ముందుకు వెలితే మనకు అసాధ్యమంటూ ఏమిలేదు.



# స్నేహం

ప్రపంచంలో అతి విలువైన అంశాలలో స్నేహం ఒకటని అంటారు కొందరు. అటువంటి స్నేహమే కొన్ని సార్లు విద్యార్థుల జీవితాలను అత్యున్నత స్థాయికి చేరుస్తుంది. మరి కొన్ని సార్లు విద్యార్థులజీవితాలను సర్వ నాశనం చేస్తుంది. అని అనటంలో సందేహం ఏమాత్రం లేదు. కావున విద్యార్థులారా మీరు ఎంచుకునే స్నేహితులే మీ జీవితానికి కొంత వరకు దిశానిర్దేశం చేయగలరు. కనుక మీరు తక్షణమే మీ స్నేహితుల ఎంపికలో జాగ్రత్త వహించండి. మీ స్నేహితులు మీ అభివృద్దిని. ఉన్నతలక్ష్యాలను కోరుకుటున్నారా, లేక మిమ్మల్ని చెడు మార్గాలవైపు ప్రోత్సహిస్తున్నారా గమనించండి. మీ స్నేహితుడు ఎటువంటి వాడా అని నిర్ణయించటానికి కొన్ని మార్గాలు లేకపోలేదు. మొదట మిమ్మల్ని మీరు జాగ్రత్తగా పరిశీలించుకోండి. మీరు చేసే పని ఏదైనా సరే అది తప్పాఒప్పా అనే విషయం మీకు ఖచ్చితంగా తెలుస్తుంది. మీరు చేసే పనిలో చెడు వుంటే అటువంటి విషయాలను మీ స్నేహితుడు ప్రోత్సహిస్తే మీరు వెంటనే కనిపెట్టవచ్చు అతడు మీ తప్పులను సమర్ధిస్తున్నాడని, ప్రపంచంలో ఏమంచి స్నేహితుడు తప్పులను సమర్దించడు. ఎందుకంటే మంచివాడు తప్పులు చేయరుగనుక, మీరు ఈ విషయంలో రాజీపడకండి. ఒక వేళ రాజీపడి చెడుస్నేహితులతో తిరిగితే మీ బంగారు భవిష్యత్తుని ఫణంగా పెట్టవలసి వస్తుంది.





మీ తల్లిదండ్రులు అప్పుడప్పుడు వాడి స్నేహం మానుకో, వీడి స్నేహం మానుకో అని అరుస్తుంటారు అలానే, మీకు తెలిసిన కొందరు పెద్దలు వాడిస్నేహం చేయవద్దు అని హెచ్చరిస్తుంటారు. అటువంటి స్నేహితుల విషయంలో మీ అంతరాత్మను ప్రశ్నించుకుని దాని ప్రకారం నడుచుకోండి. మీ మనస్సు అతనితో స్నేహం చేయవచ్చు అని అనుకుంటే చేయండి, మీ మనస్సు అతనితో స్నేహం చేయకూడదు అని అనుకుంటే పొరపాటున కూడా చేయకండి. తొందరపడి ఇతరులమాటలపై ఆధారపడి నిర్ణయాలు తీసుకోకండి. ఎందువలన అంటే ఒక చెడుస్నేహితుడికి దగ్గిరైతే మనకు కలిగే నష్టంకన్నా ఒక మంచి స్నేహితుడికి దూరమైతేనే మనకు కలిగే నష్టం ఎక్కువ జాగ్రత్త సుమా...



# అలవాట్లు

మనిషి తనుచేసే పని ఏదైతే పదే పదే చేస్తుంటాడో ఆపనే అలవాటుగా మారుతుంది. అలవాటు ఏర్పడటం అనేది చాలా స్వల్పమైన విషయం అని మనం తెలుసుకోవాలి, ఎందుకంటే మనం చేసే పనుల్లో ఎక్కుభాగం మన మెదడు ప్రేరేపిస్తే మన మనసుకు తెలిసే ఆపని చేస్తాము అది మంచి పనికానీ, చెడుపనికానీ, మనం ఒక విషయాన్ని గమనిస్తే కొన్నిసార్లు మనం జీవితానికి ఉపయోగపడే విషయాలపై కన్నా ఇతర విషయాలపైనే దృష్టిపెడతాం. వాటిలో మన ఇంట్లో డబ్బులు మనవే దొంగిలించడం, చిన్నతప్పులను కప్పిపుచ్చుకోవటానికి పెద్దతప్పులు చేయటం, ఒకరిపై ఒకరు సాడీలు చెప్పుకోవడం, ఒకరినొకరు తిట్టుకోవం. ఇలా ఎన్నో విషయాలు మనం నిత్యం పదే పదే చేస్తు ఉంటాం ఈ విషయాలు మొదట సాధారణంగా ప్రారంభమైనా, తర్వాత క్రమేణ విజృంభిస్తాయి, జీవితాలను కబలిస్తాయి. మనం చేసుకునే అలవాట్లు మన జీవితాలకే పునాదులు. అత్యంత శక్తివంతమైనది అలవాటు, మనజీవితంలోనికి ప్రవేశించిన అలవాట్లును మానివేయటం ఎంతో కష్టంతో కూడుకున్నపని. మనం సాధారణంగా కొత్త అలవాట్లను ఇతరులనుంచే నేర్పుకుంటాం. మనం నేర్చుకునే అలవాటు మొదట్లో సహజంగానే ప్రారంభించినా, అది మాత్రం నిన్ను దానిలో ఐక్యంచేసుకుంటుంది, అది మంచికాని, లేక చెడుకానీ, సాధారణంగా మంచికన్నా చెడే త్వరగా ప్రభావం చూపుతుంది.





కావున మనం చేసేపనిలో ఎంతవరకు మంచి ఉంది. ఎంతవరకు చెడుఉంది అని గమనించాలి. అలా గమనించకపోతే మనం చేసే పని చెడు అయితే పొరపాటున అదే పని మరలా చెయ్యవలసివస్తే ఆపనే నీకు అలవాటుగా మారడానికి అవకాశం ఎక్కువగా ఉంటుంది. ఒకవేల మీరు ఒకపని చేయవలసివస్తే అది మంచిగానీ, చెడుగానీ ఆపనిని మీరు ఒక పనిలాగానే చేసితక్షణమే వదిలేయయటానికి సిద్ధంగా ఉండాలి. మనకు ఉపయోగపడే పనులను అలావాటుగా మార్చుకుంటే మనకు ఎంతో మేలు ఉంటుంది. ఉదాహరణకు మనం బాగా చదవాలన్నా, మంచి పేరు తెచ్చుకోవాలన్నా, దానికి సంబంధించిన పనులు పదే పదే చేస్తూవుంటే అవే అలవాటుగా మారి మనల్ని సమాజంలో గొప్ప స్థితికి తీసుకొస్తాయి. కావున మనం మంచిగా మారాలంటే మన అలవాట్లే మనకు ముఖ్యం.



# క్రమశిక్షణా లోపం

మనం చాలాసార్లు క్రమశిక్షణగా ఉండాలి అని పెద్దలు తల్లిదండ్రులు అంటుంటారు, మనకు వాళ్ళ మాటలు వింటేనే కోపం వస్తుంది. మనం పైకి అనకపోయినా లోపలమాత్రం ఈ పెద్దలకు ఏమి పనిలేదులే ఎప్పుడూ క్రమశిక్షణ అని చంపేస్తుంటారు అని అనుకుంటారు ఒక నిజం మీరు తెలుసుకుంటె ఆశ్చర్యపోతారు. అది ఏమిటి అంటే ప్రపంచంలో ప్రతి వ్యక్తి భవిష్యత్తును ముందే నిర్ణయించే శక్తి క్రమశిక్షణకు మాత్రమే ఉంది. ఏ వ్యక్తి క్రమశిక్షణతొ పెరుగుతాడో ఆ వ్యక్తి జీవితానికి డోకానేలేదు, ఏ వ్యక్తి అయితే క్రమశిక్షణ లేకుండా పెరుగుతాడో ఆ వ్యక్తి జీవితం తెగిన గాలిపటంలా ఉంటుంది. క్రమశిక్షణంటే మీరు బయపడవద్దు సుమా, అది మీ దిన చర్యలు క్రమబద్ధంగా చేయించేది మాత్రమే ఎవరైతే వారు చేయవలసిన పనులను ఎన్ని ఆటంకాలు ఎదురైనా చేయగలరో వారు క్రమ శిక్షణగా ఉన్నారని అంటాం. ఇలా మన పనులను ఆటంకం లేకుండా ఎప్పుడైతే చేయగలిగామో అప్పుడే విజయం సాధించినట్లు, ఇలా చిన్న తనం నుండి అలవరచుకుంటే ఇక మీకు తిరుగేలేదు. క్రమశిక్షణగా ఉండాలి అని అనుకనే పిల్లలకు దాని గురించి తెలియచేయవలసిన బాధ్యత తల్లిదండ్రులమీద, ఉపాధ్యాయులమీద, పెద్దలమీద అధికంగా ఉంటుంది. ఒక పిల్లవాడు వాడికి నచ్చిన విధంగా అది మంచి అయినా





చెడు అయిన సరే ప్రవర్తిస్తుంటే దానిని సరిచేసి పిల్లవాడికి మంచి చెడుగురించి తెలియజేసి పిల్లల్లో క్రమశిక్షణా భీజాలు బలంగా నాటగలిగితే అటువంటి పిల్లలకు ఈ ప్రపంచంలో అసాధ్యమంటూ ఏదీ ఉండకపోవచ్చు. మీరు ఇప్పటికీ నష్టపోయింది ఏమీలేదు, ఇకనైనా కళ్ళు తెరవండి విచక్షణతో కూడిన క్రమ శిక్షణను ఆచరించండి, ఇతరులకు తెలియచేయండి. మీరు ధన్యులౌతారు. క్రమశిక్షణను ఆచరించిన వ్యక్తులు చరిత్రలో శక్తులుగా మిగిలారు. ఇక ఆలశ్యంచేయక చేయవలసిన పనిని సరైన సమయానికి సక్రమంగా చేయండి, చరిత్రలో మీకు స్థానం సంపాదించుకోండి.



# లక్ష్యంస్పష్టంగాం ఉండాలి

మనకు ఊహ తెలిసినప్పటినుండి మనం నిత్యం వినే మాటే లక్ష్యం ఈ పదాన్ని మనతో చాలా మంది అంటుంటారు వారిలో టీచర్లు, తల్లిదండ్రులు, పెద్దలు, స్నేహితులు, బంధువులు ఇంకా ఎందరో ప్రతి ఒక్కరు కూడా లక్ష్యం లేకపోతే ఏమి సాధించలేవు ఏదో ఒక లక్ష్యాన్ని సాధించాలి అని అంటుంటారు. అందుకు మనం ఖచ్చితంగా ఏదో ఒకటి సాధించాలి అని పట్టుదలతో ఉంటాం. పరీక్షలలోఎన్ని మార్కులు సాధించినా ఏదో వెలితిగానే ఉంటుంది. దీనికి కారణం వారు నిజమైన లక్ష్యాన్ని సాధించకపోవటమే. విధ్యార్థులు ఎంచుకునే లక్ష్యం స్పష్టంగా సూటిగా ఉండాలి. దానిలో ఏమాత్రం సందేహానికి తావివ్వకూడదు. అప్పుడు ఖచ్చింతంగా అనుకున్నది సాధించగలరు. లక్ష్యాన్ని ఎంచుకునే ముందు విధ్యార్థులు ఆవిషయంపై పూర్తి అవగాహన కలిగి ఉండాలి. నిర్ణయాలు తీసుకున్నాక పదేపదే మార్పు చేయకూడదు. నాకు అదికావాలా, ఇది కావాలా అనే సందిగ్ధపరిస్థితి ఏర్పడకూడదు. నేను ఇది సాధించగలనా సాధించలేనా అనే సంధేహం రాకూడదు. నేను ఇది కోరుకున్నాను ఇది సాధించటానికి ఇంత సమయం తీసుకుంటున్నాను, ఇది సాధించటానికి నేను ఎంత అయితే కష్టపడాలో అంత కష్టపడతాను అని నిర్ణయం తీసుకుంటే మీకు అసాధ్యమైన లక్ష్యాలు ఈ ప్రపంచంలోనే లేవు ఇది నిజం.





లక్ష్యాన్ని చిన్నవయసులోనే ఎంపిక చేసుకుంటే మీకు కాలం శ్రమ అన్నీ కలిసొస్తాయి. లక్ష్యం ఎంపిక ప్రక్రియ జరిగాక మనం చేసే పని, మనం చదిలే చదువు అన్నీకూడా లక్ష్యానికి అనుకూలంగానే ఉండాలి. అలా కాకుండా మనం ఒక లక్ష్యాన్ని ఎంచుకుని మనం చేసే పని దానికి విరుద్ధమైతే మన లక్ష్యం స్పష్టంగా లేదని గమనించండి ఇటువంటి లక్ష్యాలు ఎప్పటికైనా నెరవేరవు. ఉదాహరణకు చిన్న తనంలోనే పోలీస్‌కావాలని లక్ష్యం ఏర్పరచుకోని చిన్నతనం నుండి దొంగతనాలు చేయటం, లాయర్ కావాలి అనుకొని అన్నీఅబద్ధాలు చెప్పటం, డాక్టర్ కావాలనుకుని ఇంటర్‌లో సోషల్ చదవటం, కలెక్టర్ కావాలనుకొని కోతి పనులు చేయటం, ఇవన్నీ కూడా మీరు అనుకున్న లక్ష్యాలను ఎప్పటికీ మిమ్మల్ని చేరనివ్వవు, కావున మీరు కలెక్టర్ కావాలనుకుంటే చిన్న తనం నుంచే దాని గురించి అన్నీ విషయాలు తెలుసుకోవాలి. ఏ చదువు చదివితే కలెక్టర్ అవుతారు, వయసుఎంత ఉండాలి, పరీక్షలు ఎలా ఉంటాయి, ఎంత ఖర్చు అవుతుంది ఇంకా దానిలో ఉండే కష్టసుఖాలు అన్నీ కూడా అవగాహన చేసుకుని ఇది నేను సాధించగలనా అని అంచనా వేసుకుని రంగంలోకి దిగాలి. మనం ఎంచుకునే రంగం కూడా సమాజంలో మంచి గుర్తింపు వచ్చేదిగా ఉండాలి. మీరు ఎంచుకునే రంగాలు క్రిందివిధంగా ఉన్నాయి.

**పరిపాలనకు సంబంధించినవి :** ఐ.ఎ.యస్, ఐ.పి.యస్, ఎమ్.ఆర్.ఒ., ఎం.డి.ఒ, డి.యస్.పి. ఎస్.ఐ, టీచర్ ఇంజనీర్, ఇంకా అనేకం ఉన్నాయి.

**న్యాయవ్యవస్థకు సంబందించినవి :** లాయర్, జడ్జీలు

**రాజకీయవ్యవస్థకు సంబంధించినవి :** ఎం.యల్.ఎ, ఎం.పి, మినిస్టర్స్, సి.యం., పి.యం.

**మీడియా వ్యవస్థ సంబంధించినవి :** జర్నలిస్ట్‌లు, టివీ, రేడియో, పేపర్‌లు, మొదలుగున్నవి.

**సామాజిక వ్యవస్థకు సంబంధించినవి :** సేవాకార్యక్రమాలు, స్వయం వ్యాపారాలు, క్రీడలు, ప్రైవేట్ ఉద్యోగాలు ఇలా అనేక రంగాలు ఉన్నాయి. వీటిలో మీకు బాగా నచ్చిన రంగాన్ని, ఇష్టంతో చిన్నతనంలోనే మీ మెదడులో నాటింపచేసి దానికోసం పరతపిస్తే మీరు ఖచ్చితంగా నిర్ణీత సమయంలో దానిని పొందగలరు. దీనిలో ఏమాత్రం సందేహం లేదు. ఈ విధంగా ప్రణాళిక ప్రకారం పాటిస్తే ఇక విజయం మీదే. దీని గురించి పిల్లల్లో అవగాహన కలిగించవలసిన బాధ్యత తల్లిదండ్రులమీద, ఉపాధ్యాయుల మీద ఉంటుంది. వారు ఇచ్చే సూచనలమేరకే విద్యార్థులకు లక్ష్యసిద్ధి కలుగుతుంది.







## కుటుంబసభ్యులచె తిరస్కారం పొందకండి

ప్రియమైన మిత్రులారా మనం ప్రతినిత్యం ఎన్నో ఆలోచనలు చేస్తూ ఉంటాం. వాటిలో కొన్ని మంచివి, కొన్ని చెడ్డవి, కాని మనల్ని అందరూ ఎక్కువగా గుర్తించేది చెడ్డపనులలోనే మంచి పనులను గుర్తించాలంటే చాలా కాలాం పట్టవచ్చు. మనం చేసే పనులను విమర్శించేవారిలో మొదట మనస్నేహితులుండగా తర్వాత ఉపాద్యాయుల, మన ఇరుగుపొరుగువారు, ఇంకా సమాజంలోని వారంతా మనల్ని నిరతరం మంచిగా పొగుడుతూనే ఉండి మనలోపాలని అప్పుడప్పుడు వేలెత్తి చూపిస్తూ మనల్ని సమాజంలో చులకన చేస్తూ ఉంటారు. కాని మనం లెక్కకూడా చెయ్యం ఎందుకంటే ఎంత మంది ఎన్ని రకాలుగా విమర్శించినా కూడా మన తల్లిదండ్రులు మనల్ని సమర్థిస్తుంటారు. మనం చేసే తప్పులను సమర్థించే వారిలో తల్లిదండ్రులే ముందుంటారు. ఎంతమంది ఎన్ని చెప్పినా కూడా మా పిల్లలు చాలా మంచివారు మా పిల్లలు ఎప్పుడూ తప్పు చెయ్యరు అని అంటుంటారు. కాని కొన్నిసార్లు మనల్ని సమర్థించే తల్లిదండ్రులే మనల్ని విమర్శించారంటే, మనం ఏస్థితికి దిగజారామో మీ అంతరాత్మకే తెలియాలి. తల్లిదండ్రులు అంతసామాన్యంగా ఏమీ అనరు, ఒకవేల అన్నారంటే మీరు చేసిన పనిని ఖచ్చితంగా

సరిచేసుకోవాల్సిందే ఒకవేల సరిచేసుకోలేని పనులు చేసారంటే మీజీవితానికే అర్థంలేనట్టే. కావున మిత్రులారా, పెద్దలు చెప్పిన ఇంటగెలిచి రచ్చగెలవండి అనే సామెత మీరు ఎప్పుడూ గుర్తించుకోవాలి. మీరు ఇంట్లో తల్లిదండ్రులు, కుటుంబసభ్యులు మన్ననలు పొందనిదే జీవితంలో ఏదీ సాధించలేరు. మీరు చేసే పనులలో అది ఏదైనా సరే మంచి చెడులు గమనించి, నేను చేసే మనివల్ల నాకు గాని, నాతల్లిదండ్రులకు గాని, సమాజానికి గాని చెడ్డపేరు రాదు అనిఆలోచించి విచక్షణతో చేస్తే మీకు విజయం చేకూరుతుంది మిమ్మల్ని చూసి మీ తల్లిదండ్రులు గర్వీస్తారు.







## సమాజంలో అవహేళనకు గురికావద్దు

మనం ప్రతి రోజూ అనేక రకాలైన వ్యక్తులను చూస్తూ ఉంటాము వారితో మాట్లాడుతుంటాం. వారినుంచి అనేక ఆలోచనలు పొంది వాటిని అమలు చేసే పనిచేస్తుఉంటాం. వాటిలో మంచిపనులు ఉండవచ్చు, చెడుపనులు ఉండవచ్చు, మనం కొన్నిసార్లు ఈ పని చేయటం తప్పూ అని తెలిసినా చేస్తుంటాం. మనం ఒక సారి చేసిన తప్పువల్ల పొందిన లాభాన్ని దృష్టిలో పెట్టుకుని పదే పదే తప్పులు చేస్తుంటాం. మనల్ని ఎవరూచూడలేదనుకుంటాం. మీరు చేసే పనులు ఎవరికీ తెలియదులే అని అనుకుంటారు. కాని మీరు చేసే ప్రతి పనిని మీ ప్రతి ఆలోచనలను ఈ సమాజం నిరంతరం గమనిస్తూనే ఉంటుంది. మీరు ఎవరి నుండి తప్పించుకున్నా సమాజం నుండి తప్పించుకోలేరు. ఈ సమాజం మంచి పనులు చేసినప్పుడు మంచివాడు అని చెడ్డపనులు చేసినప్పుడు చెడ్డవాడు అని అంటుంది. మీరు సిసి కెమేరాలనుండి తప్పించుకున్నా సమాజం నుండి తప్పించుకోలేరు. ఉదాహరణకు కొంతమంది పిల్లలు స్కూల్‌కి అని బయలు దేరి బయటతిరిగి సమయానికి ఇంటికి వెళ్ళటం, ఇంట్లో చిల్లర డబ్బులు దొంగిలించటం, స్కూల్‌లో అబద్ధాలు చెప్పటం, ఇంకా అనేక రకాలైన చిన్న చిన్న తప్పులు

చేస్తుంటారు. కాని వారు ఇప్పుడు బయటపడకపోయినా ఏదో ఒక రోజు బయటపడక తప్పదు. మీరు కూడా ఇలాంటి పనులు ఏఒక్కటి చేస్తున్నా వెంటనే మానివేయండి లేకుంటే ఈ చిన్న పనులే అలవాటుగా మారి మీ జీవితాలను చెడుమార్గంలో పెడతాయి. అందువలన మీరు చేసే పనిలో నిరంతరం అప్రమత్తతతో ఉండాలి. మీరు ఈ ప్రపంచంలో ఎవరి చేత అవహేళనకు గురైనా పర్వాలేదుగాని ఈ సమాజంచేత అవహేళనకు గురైతే జీవితమే వృధా, కావున మనం సమాజపరిస్థితులకు అనుగుణంగా నడుచుకుంటే ఈ సమాజమే మిమ్మల్ని మీరు ఊహించని స్థాయికి తీసుకెలుతుంది. ఇది సత్యం.







# నెగిటీవ్‌గా ఆలోచించవద్దు

లేని విషయాన్ని ఉన్నట్లుగా ఉన్న విషయాలను లేనట్లుగా ఆలోచించడాన్నే నెగటీవ్‌గా ఆలోచించడం అంటారు. కొంత మంది విద్యార్థులు నిజంగా కష్టపడుతూ ఉంటారు, కానీ ఫలితాలు మాత్రం అనుకున్న విధంగా రావు అప్పుడు ఆవిధ్యార్థులు చాలా బాధకు గురిఅవుతుంటారు. వారిలో మీరు కూడా ఉండవచ్చు. ఈ విధంగా అనుకున్నవి జరగనప్పుడు మీరు వెంటనే నేను ముందే అనుకున్నా నేను ఎంత కష్టపడ్డా ఫలితంరాదని, నాజీవితం ఇంతే, ఇది నాకర్మ, కష్టపడటం కూడా వృధాయే, నాకన్నా బాగా చదవని వాళ్ళకు మంచి మార్కులొచ్చాయి, దీంట్లో ఏదోమోసం జరిగిందని ఇలా ఏదేదో అనుకుని కాలం గడుపుతుంటారు. ఇంతే కాకుండా ప్రతి దానికి తమనితాము కించపరుచుకుంటూ ఇతరులను కించపరుస్తూ విమర్శిస్తు వారి మీద వారికే నమ్మకం లేకుండా ఇతరులను నమ్మక, జీవితాలను ఇబ్బంది పాలు చేసుకుంటుంటారు. పైన చెప్పిన విషయాలలో ఏఒక్కటి మీరు అనుకుంటున్నా మీకు కొద్ది పాటి నెగిటీవ్ వైరస్ సోకినట్లే, వెంటనే మీనుండి దానిని తరమండి లేకుంటే అంతే సంగతలు, మీకుగాని నెగిటీవ్ ఆలోచనలు ఉంటే మీ ప్రతిభను గుర్తించి మీకు ఐ.ఎ.ఎస్.

పదవి ఇచ్చినా కూడా మీరు నాకు అంతసీను లేదులే అని వదిలేసుకుంటారు. కావున విద్యార్థులారా మీలోని ఆలోచనలను మీరు నిరంతరం గమనిస్తూ ఉండండి. మీకు తెలియకుండానే నెగిటీవ్ ఆలోచనలు వస్తే వెంటనే వాటిని పాజిటీవ్‌గా మార్చేయండి అలామార్చాలంటే మనమీద మనకు ఆత్మవిశ్వాసం కలగాలి. ఆవిశ్వాసం ఎలాఉండాలంటే ఏదైన పనిని నేనుకూడా కష్టపడితే చేస్తాను అనే విధంగా ఉండాలి. అలాకాక నేనొక్కడినే ఈ పనిని చేయగలను అంటే అది ఆత్మవిశ్వాసం కాదు, అతివిశ్వాసం అవుతుంది. మీరు చేసే ఏపనైనా సరే ఆపని యొక్క ఫలితాన్ని పొందటానికి కావలసిన శ్రమ చేస్తే ఖచ్చితంగా జరిగితీరుతుంది. అంతేగాని, నేను ఈ పనిని చేయలేను అనే నెగిటీవ్ ఆలోచనలతో ఉంటే మీ జీవితం ఇక అంతే ఎవరూ బాగుచేయలేరు. మీలోని నెగిటీవ్ ఆలోచనలను దూరం చేసుకోవాలంటే ఆత్మవిశ్వాసంతో గొప్పవారైన వారి జీవిత చరిత్రలు చదవటం, ఎప్పుడూ ఆత్మవిశ్వాసంతో ఉండటం. నెగిటీవ్ ఆలోచనలంటే ఏ విషయాలైతే ప్రస్తుతం నిజంగా మీకు అవసరం ఉండవో ఆవిషయాల గురించి ఆలోచిస్తు బాధపడుతూ మానసికంగా కృంగిపోవటమే. దీనివలన మీ అనవసరవిషయాలు తీరకపోగా మీ అవసర విషయాలపై ఆప్రభావం పడి మీరు ఏమి చేయలేని నిస్సాయస్థితిలో ఉండిపోతారు. ఉదాహరణకు మీరు





పదవతరగతి చదువుతున్నారు కాని మీ ఆలోచనంతా వచ్చేసంవత్సరం ఇంటర్‌లో ఏ గ్రూపులో చేరితే బాగుంటుంది. ఏ కాలేజిలో చేరితే బాగుంటుంది, ఏ ఊరిలో చదివితే బాగుంటుంది. అసలు నేను చదవటానికి మాఇంట్లో ఒప్పుకుంటారా, డబ్బులు ఖర్చుపెడతారా, లేదా అని రకరకాలుగా ఆలోచిస్తూ ఉండి, అంతేకాకుండా ఇంటర్ తర్వాత ఏమిచెయ్యాలి. ఎలాచెయ్యాలి లేకుంటే చదువు మానివేసి ఏదైనా పనిచేసుకుందామా అని వితండమైన ఆలోచనలతో కాలం గడుపుతూ, అసలు చదువుకే ఎసరు తెచ్చుకుంటారు. మిత్రులారా మనం రాబోయే రోజులో ఏమి చెయ్యాలి అని ఆలోచించడం చాలు మంచిదే కాని ప్రస్తుతం చేస్తున్న పనిని పక్కన పెట్టి అతిగా ఆలోచించడం మనకు అంత శ్రేయస్కరము కాదు. నెగిటీవ్ ఆలోచనలు పోగొట్టుకొవాలంటే మనపై మనకు అపారమైన నమ్మకాని కలిగిఉండి, మనం చేసే పనిలోకూడా అంతే నమ్మకాన్ని కలిగిఉండాలి. ఇకమీకు తిరుగేలేదు. విజయం మీదే.



# జీవితంపై విరక్తి

చాలా మంది విద్యార్థులు పరీక్షల్లో మార్కులు తగ్గినప్పుడు, ఇంట్లో తల్లిదండ్రులు అరచినప్పుడు, చిన్న చిన్న అవమానాలు జరిగినప్పుడు వెంటనే జీవితంపై విరక్తిచెంది. నా జీవితం వృదా, నేను జీవించటం కూడా వృధాయే అని భావించుకుని ఆత్మహత్యలకు సిద్దమౌతారు. అలా చేయటం వల్ల వాళ్ళకు వచ్చేది ఏమిలేకపోగా చనిపోయిన తర్వాతకూడా కొన్ని దశాబ్దాలపాటు మాటలు పడుతూనే ఉంటారు. వారు మాటలు పడటమేకాక వాళ్ళ తల్లిదండ్రులకు కూడా చెడ్డ పేరు తెచ్చినవారవుతారు, ప్రియమైన విద్యార్థులార మీలో చాలామంది క్షణికావేసానికి గురౌతుంటారు అలాఅయ్యే వారెవ్వరైనా సరే జీవితంపైన నమ్మకం లేనివాళ్ళే అని తెలుసుకోండి. ఎందుకంటే అటువంటి వారే ఎప్పుడైనా ఆత్మహత్యలకు ప్రయత్నిస్తారు. మీరు ఒక విషయాన్నిగమనించండి, మనం ఏవిషయంలో ఓడిపోయామని ఆత్మహత్యలకు ప్రయత్నించాలి, ఎందుకు జీవితంపై విరక్తిచెందాలి. ఓటమి, అవమానం అనేవి ప్రతివ్యక్తి జీవితంలో సర్వసాధారణం మీకు తెలిసి ఈ ప్రపంచంలో ఒక్కసారి కూడా అవమానం పొందనివారు గాని, ఓటమి అనేదే తెలియనివారుగాని ఉన్నారా, అలా ఉన్నారని నిరూపిస్తే నాజీవితాన్నే మీకు దాసోహం చేస్తా. ఈ ప్రపంచంలో పుట్టిన ఏవ్యక్తి కైనా ఓటమి,





అవమానాలు, ఆర్థిక సమస్యలు సర్వసాధారణం. ఇవి అన్నీకూడా మనం సృష్టించుకున్నవే. పోటీలో గెలిచినవాడినే విజేత అంటాం. ఓడినవాడిని ఓడిపోయాడంటాం. అంతేకాని అతడు మనిషికాకుండా పోతాడు. లేకుంటే ఇక ఎప్పటికి విజయాలు పొందకపోతాడా. గమనించండి. చరిత్రలో ఓడిపోయి గెలిచిన థామస్ ఆల్వా ఎడిషన్, అబ్రహాం లింకన్, నెల్సన్ మండేలా, మహాత్మాగాంధీ, నేతాజీ, మైక్‌టైసన్, సచిన్ ఇలా ఎందరో తమ జీవితంలో ఎన్నో అవమానాలు, అపజయాలను చూసి ఆత్మవిశ్వాసంతో ముందుకు నడిచి ప్రపంచ ప్రసిద్ధిగాంచారు. అకుంటిత దీక్ష, పట్టుదల, ఆత్మవిశ్వాసం ఉంటే ఎన్ని అవమానాలు జరిగినా ఎన్ని ఓటములు చవిచూసినా, ఆర్థికంగా కృంగిపోయినా జీవితంపై విరక్తి కలగకూడదు. నిండునూరేళ్ళు జీవితాన్ని కృంగిపోయినా, జీవితంపై విరక్తికలగకూడదు. నిండునూరేళ్ళ జీవితాన్ని సుఖంగా జీవించటానికే ఇష్టపడతాడు విజేత. మన జీవితంలో వచ్చే చేదును కూడా ఒక రుచిగా స్వీకరించగలిగినప్పుడే మనకు మంచి కలుగుతుంది. ఆవేశంతో ఏపనిచేయకండి అవే అనర్థాలకు దారితీస్తుంది. ఆలోచనతో ముందుకెళ్లండి. అన్నీ మనమంచికే జరుగుతాయి. మనకు జరిగిన నష్టానికి గలకారణాలను వెతకండి వాటిని సరిచేయండి అవే మన విజయాలకు తొలిమెట్లు అవుతాయి. మీజీవితంలో ఎన్నికష్టాలు వచ్చినా సరే జీవితంపై విరక్తిచెందకండి, ఆత్మహత్యలు చేసుకోకండి.

## ఆత్మ విశ్వాసంతో పనిచేస్తే అసాధ్యమైనది ఏది లేదు

మనం చేసే ప్రతి పని నమ్మకంతో చేయాలి. ఏ పనైతే ఆపనమ్మకంతో చేస్తావో అది ఖచ్చితంగా జరగదు. కావున విశ్వాసమనేది అత్యంత ముఖ్యమైనది ఆ విశ్వాసం కూడా తిరుగలేనిదైతే దానిని ఆత్మ విశ్వాసం అంటారు. ముందు మీ మీద మీకు నమ్మకం ఉండాలి. మీరు చేసే పని అది ఏదైనా సరే నేను ఖచ్చితంగా సాధిచగలను. ఆ పని సాధించటానికి కావలసిన ప్రయత్నం నేను చేస్తున్నాను. అందువలన ఈ పనిలో విజయం తధ్యం అని అనుకోవటం ఆత్మ విశ్వాసం అవుతుంది. కాని కొన్ని సార్లు మనం చేసే పని మీద మనకు నమ్మకం ఉండదు. కాని పైకి నమ్మకం ఉన్నట్లుగానే ఉంటాం. ఈ విధంగా పని మొదలు పెడితే మీరు ఆపనిలో విజయం సాధించలేరు. ఇది నిజం ఉదాహరణకు మీరు ఒక పరీక్షకు ప్రిపేర్ అవుతున్నారు అనుకుంటే ఆ పరీక్ష మీద మీకు అనేక సందేహాలుంటే, లేదా ఆ పరీక్ష రాసినా కూడా మాకు రాదులే అని అనుకొని ఉంటే మీరు ఖచ్చితంగా ఆ పరీక్షల్లో విఫలమవుతారు. కాని మీరు రాసే పరీక్ష మీద మీకు మొదట నమ్మకం లేకపోయినా, తర్వాతైనా సరే నమ్మకాన్ని కలిగి ఆ పరీక్షపైన అవగాహన పొంది. ఇటువంటి పరీక్ష ఇప్పటికి ఎవరూ సాధించలేదా లేక నేనొక్కడినే సాధించలేక పోతున్నానా అని, అసలు





నేను ఎందుకు సాధించకూడదు. ఈ పరీక్షను సాధించడానికి కావలసిన ప్రయత్నం నేను చేస్తే ఎందుకు  సాధించలేను అని మిమ్ముల్ని మీరు ప్రశ్నించుకుని విశ్వాసాన్ని రెట్టింపు చేసుకొని ఆత్మ విశ్వాసంతో ముందుకు అడుగు వేస్తే మీరు ఎందుకు అపజయాలు పొందుతారు.

మీరు తెలుసుకోవలసిన అత్యంత విలువైనది ఈ ఆత్మవిశ్వాసం దానిని ఎల్లప్పుడు మీ వెన్నంటనే ఉంచుకోండి మీకు అన్ని విజయాలే అవి క్లర్క్ పోస్ట్ అయినా లేక కలెక్టర్ పోస్ట్ అయినా ఒక ముఖ్యసూచన, మీరుపొందే విశ్వాసం ఎప్పటికి అతివిశ్వాసం కారాదు. అంటే ఏదైన ఒక పనిని నేను మాత్రమే చేయగలను. అనే భావన దీని వలన మీరు చాలా నష్టపోతారు. నేను మాత్రమే అనే అహంకార స్వభావం కన్నా నేను కూడా చేయగలను అనే ఆత్మ విశ్వాసపు మాటలను మాట్లాడండి అంతా మంచే జరుగుతుంది.



# ప్రేరణ పొందండి

ప్రపంచంలో విజయాలు పొందిన వారందరూ వ్యక్తుల నుండో కొన్ని విషయాలనుండో, కొన్ని సంఘటనలనుండో లేక కష్టాలనుండో, ప్రేరణపొందినవాల్లే, ప్రేరణ ద్వారానే ఎవరు ఎదైనా సాధించగలరు. ప్రేరణ ఒక శక్తి, ఒక వింత, ఒక అద్భుతం. బలహీనులను బలవంతులుగాను, పేదవారిని ధనికులుగాను, చదవలేని వారిని గొప్ప విజేతలుగాను మార్చగల శక్తి ఒక ప్రేరణకే ఉంది. అంటే నమ్మశక్యం కాదు. ప్రేరణ అనేది ప్రతివ్యక్తిలో ఉన్న అద్భుతశక్తిని వెలికితీస్తుంది. ఇటువంటి విషయాన్ని గురించి మీరు తెలుసుకోవలసిన అవసరం ఎంతైనావుంది. విద్యార్దులారా ప్రేరణ పొందే విషయంలో చాలా జాగ్రత్త వహించండి. ప్రేరణ మనకు సహజంగా ఉపన్యాసాలలోను, సన్మానసభలలోను, సినిమాలలోను, పుస్తకాలలోను విజేతలైన గొప్ప వ్యక్తుల నుండో లభిస్తుంది. వీటిలో మీరు చాలా త్వరగా ప్రేరణ పొందేది ఉపన్యాసాలలోను, సన్మానసభలలోను, సినిమాలనుండి ఇటువంటి ప్రేరణ చాలా ఉధృతంగా పనిచేసి వెంటనే నేను కూడా గొప్ప స్థాయికి వచ్చి ఉపన్యాసాలివ్వాలనో, సన్మానాలు చేయించుకోవాలనో లేక సినిమాలలో నటించాలనో అనిపిస్తుంది. కాని ఇటువంటి ప్రేరణ





ఎక్కువమందికి తాత్కాలికంగా వస్తుంది. నిజ జీవితంలో పడ్డకష్టాలనుండి పొందే ప్రేరణ జీవితకాలం ఉంటుంది. అటువంటి ప్రేరణతోనే అనుకున్నవి సాధిస్తారు.

ప్రేరణ పొందాలంటే మీరు గొప్ప వ్యక్తుల జీవిత చరిత్ర పుస్తకాలు చదవటం ఎంతో మంచిది. ఉదాహరణకు అత్యంత ప్రేరణ కల్పించే వివేకానంద స్వామి, నేతాజి, గాంధీజి, అబ్దుల్ కలాం, వంటి వారియొక్క జీవిత చరిత్రలు చదివితే మనకు తెలియకుండానే మన అలవాట్లు మారిపోయి సమాజంలో ప్రత్యేకమైన వ్యక్తిగా తయారవటమే కాక ఇష్టమైన రంగంలో ప్రతిభ కనబరుస్తారు. గొప్పస్థాయికి వెలతారు. ప్రేరణ గురించి తెలియచేసి విద్యార్థులల్లో ప్రేరణ కల్గించవలసిన బాధ్యత తల్లిదండ్రులమీద ఉపాధ్యయులమీద ఎంతైనా ఉంది. ప్రేరణను అందిచటంలో వారు ఎలా సాయంచేస్తారో, ప్రేరణను అందకోవటానికి విద్యార్దులు కూడ అంతే ఇష్టత చూపించాలి. ఎంత త్వరగా శాశ్వత ప్రేరణ పొందగలరో అంతే త్వరగా విజయాలను పొందగలరు.



# సమయపాలన పాటించండి

జీవితంలో అతి ముఖ్యమైన విషయాలలో సమయపాలన ఒకటి ఏవ్యక్తి అయితే అనుకున్న పని అనుకున్న సమయానికి పూర్తి చేయగలడో ఆవ్యక్తినమ్మకాన్ని పొందుతాడు ఆనమ్మకమే అతడిని జీవితాంతం కాపాడుతుంది. ఏవ్యక్తి అయితే అనుకున్న సమయానికి పని పూర్తి చేయలేడో ఆవ్యక్తిపై నమ్మకం పోతుంది. ఈ సమయపాలనపైన ఆధారపడే ప్రతి వ్యక్తి యొక్క వ్యక్తిత్వాన్ని తెలుసుకొనవచ్చు. సమయపాలన పాటించవలసిన వారిలో ముఖ్యంగా విద్యార్థులు అని చెప్పవచ్చు. విద్యార్థి తన విద్యాభ్యాసం మొత్తం కూడా సమయపాలన మీదే ఆధారపడి ఉంటుంది. ఏ విద్యార్థి అయితే స్కూల్‌కి సమయానికి వస్తాడో, స్కూల్‌లో జరిగే అన్ని కార్యక్రమాలలో సమయాన్ని పాటిస్తూ ఉంటాడో అటువంటి విద్యార్థిని ఉత్తమవిద్యార్థిగా పరిగనిస్తారు. విద్యార్థులు ముఖ్యంగా తము చేయవలసిన హోమ్‌వర్క్‌లను సమయానికి చేసి చూపిస్తారో అటువంటి విద్యార్థులపైన ఉపాధ్యాయులకు, తల్లిదండ్రులకు, స్నేహితులకు మంచి అభిప్రాయాన్ని కలిగి ఉంటారు. ఉత్తమ విద్యార్థులనే వారు ఎప్పుడు కూడా చేయవలసిన పనులను





వాయిదా వెయ్యరు. ఈ విధంగా సమయపాలను పాఠశాలల్లోనే కాకుండా ఆహారంతీసుకునే విషయంలో, ఆటలు ఆడేవిషయంలో ఇతరాత్ర కార్యక్రమలు చేసే విషయంలో పాటించటం ఎంతైనా అవసరం.

కొంతమంది ఈ సమయపాలన చేయక పోయినా పర్వాలేదు అనుకుంటే జీవితంలో ఇబ్బందుల పాలౌతారు. ఎట్టి పరిస్థితిలో మీరు ఎంచుకున్న సమయపాలనతో రాజీ పడవద్దు. కొన్నిసార్లు ఉదయం ఐదుగంటలకల్లా నిద్ర లేవాలని అనుకున్నా లేవలేకపోతుంటాం. దీనికి కారణం దృఢసంకల్పం లేకపోవడమే సమయయపాలన పాటించాలంటే దృఢ సంకల్పం ఉండాలి. ఎన్ని అవాంతరాలు వచ్చినా నేను అనుకున్న సమయానికి చేయవలసింది చేసి తీరుతాను అనే సంకల్పం ఉండాలి. కొన్ని సార్లు ఆరోగ్య సమస్యలవల్ల నిర్ణీత సమయానికి అనుకున్న పని చెయ్యకపోయినా దాని వల్ల పెను ప్రమాదమేమి లేదు. సమయాపాలనను మధ్య వయస్సు నుంచి అమలు పరచాలని చూసినా మంచిదేకాని, చిన్నతనంలో అలవడితేనే మరీ మంచిది. ఇటువంటి అలవాట్లును చేయవలసిన బాధ్యత ఖచ్చితంగా తల్లిదండ్రులమీదుంటుంది. అటు తర్వాత ఉపాధ్యాయులు మీద ఉంటుంది.

# ఏకాగ్రత ఎంతో ముఖ్యం

నిత్యం మనం వినే మాటల్లో ఏకాగ్రత ఒకటి మనిషికి ఏ శక్తులు ఉన్నా లేకపోయినా ఏకాగ్రత శక్తి ఉంటే అన్నీ శక్తులను పొందగలడు. ఏకాగ్రతతోనే ఏకలవ్యుడు విలువిద్యను నేర్చుకున్నాడు. ఏకాగ్రతతోనే న్యూటన్ గురుత్వాకర్షణ శక్తిని కనుగొన్నాడు. ఈ శక్తితోనే ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతాన్ని కనుగొన్నాడు. ఈ శక్తితోనే ఎడిసన్ బల్బ్, ఫ్లెమింగ్ పెన్సిలిన్‌ను కనుగొన్నారు. అంతెందుకు ఈ ఏకాగ్రత శక్తితోనే మీరు అన్నీ పనులు చేయగలుగుతున్నారు. ఈ శక్తితోనే మీరు అనేక మంది పేర్లను గుర్తు పెట్టుకుకోగలుగుతున్నారు. అందుకే ఈ ఏకాగ్రత అంటే అంతశక్తి గలది. ఇటువంటి శక్తి అందరికీ ఉంటుందా ఉండదా అంటే ఈ ప్రశ్న ఖచ్చితంగా ప్రతి వ్యక్తికి ఏకాగ్రత శక్తి ఉంటుంది అని చెప్పవచ్చు. నిరూపించగలరా అని మీరంటే ఖచ్చితంగా మీకు ఏకాగ్రత శక్తి లేకపోతే మొదట మీకు మీ పేరు గుర్తుండదు. ఆ తర్వాత మీ తల్లిదండ్రుల పేర్లు గుర్తుండవు. ఇవి గుర్తున్నాయి అంటే మీకు ఖచ్చితంగా ఏకాగ్రత శక్తి ఉన్నట్లే ఎలా అంటారా ఏవ్యక్తి అయితే ఇది అతి ముఖ్యమైన విషయం. ఇది నాకు కావాలి అని ఇష్టపూర్వకంగా తన మెదడుకు తెలుపుతాడో ఆ విషయం ఖచ్చింతంగా జీవితాతం ఉంటుంది. ఈ సమాచారం కావాలి అని ఇష్టత చూపకుండా తన మెదడుకు పంపుతాడో ఆ విషయం కొద్దిరోజులు ఉండి తర్వాత మాయమౌతుంది.





ఉదాహరణకు చెప్పాలంటే ఒక రాయి మీద చాక్‌పీస్‌తో రాసిన అక్షరాలు, రంగులతో రాసిన అక్షరాలు, సుత్తితో చెక్కిన అక్షరాలు ఉన్నాయనుకుంటే చాక్‌పీస్‌తో రాసిన అక్షరాలు చెరిగిపోతాయి, రంగులతో వేసిన అక్షరాలు పోవాలంటే కొంత కాలం పడుతుంది. సుత్తితో చెక్కిన అక్షరాలు ఎప్పటికీ పోవు. ఈ విధంగా ఏకాగ్రత కావాలంటే మీరు ఏ విషయమైతే కావాలనుకుంటారో ఆ విషయాన్ని ఎంతో ఇష్టపూర్వకంగా అర్ధవంతంగా మీ మెదడుకు ఇవ్వగలిగితే అదే పడిఉంటుంది. మీకు అవసరమైనప్పుడు వెతికి తీసుకోవచ్చు.

ఈ ఏకాగ్రత అనేది ముఖ్యంగా విద్యార్ధులకు అవసరం చాలా మంది విద్యార్థులు మేము బాగా చదువుతున్నాం కాని ఎంత చదివినా పరిక్షల సమయంలో గుర్తుకు రావటంలేదని బాధపడుతున్నారు. దీనికి మార్గం లేకపోలేదు. మీరు చదివే విషయాన్ని ప్రశ్నలు, సమాధానాల పద్దతిలో కాకుండా చదువుతున్న అంశం యొక్క పూర్తి వివరాలు ఇష్టంతో ఈ విషయం నాకు కావాలి అనే కోరికతో తెలుసుకుంటే ఆ విషయం మీ మెదడుకు స్పష్టంగా చేరుతుంది. అప్పుడు మీకు పరీక్షల్లో ప్రశ్న ఎలా వచ్చినా కూడా రాయగలరు. మంచి మార్కులు సాధించగలరు. ఏది ఏమైనా గాని ఏకాగ్రత రావాలంటే సంభందిత విషయంపై ఇష్టంతో కూడుకున్న అవగాహన అవసరం. ఈ మాత్రం దానికి మీరు బాధ పడనవర లేదు. మీకు ఏకాగ్రత సిద్ధి కలిగిందంటే మీకు మీరే సాటి. ఏది కోరుకుంటే అదే అయ్యి తీరుతారు. ఏకాగ్రత బాగా కలగాలంటే మనస్సును నిర్మలంగా ఉంచుకుని మనం చేసే పని మీద శ్రద్ధ కనబరుస్తుంటే ప్రతి పనిలోను ఏకాగ్రత ఉంటుంది.

# అపజయాలను లెక్కపెట్టకండి

మనం చేసే పని ఏదైనా సరే జరగాలని అనుకుంటాం మనం అనుకున్న పని నెరవేరటానికి అనేక మార్గాలు ఎంచుకుంటాం. చాలా కష్ట పడతాం అయినా కూడా కొన్నిసార్లు అపజయం పొందక తప్పదు. ఎంత కష్టపడ్డా కూడా మనం అనుకున్నంత ఫలితం రాకపోతే మన బాధకు అడ్డేవుండదు. మనం ఎంచుకున్న పని మీద విరక్తి కలుగుతుంది. ఆ ప్రభావం వేరే పనుల మీద పడి మనలను బలహీన పరుస్తుంది. అపజయాలనేవి ఎప్పుడు కూడా చెప్పిరావు. అవి అత్యంత సాధారణమైన విషయం అపజయాలకు ఎప్పటికీ కృంగకూడదు. అదే జీవితంకాదు. ఇది ఒక ప్రయత్నం మాత్రమే మీకు అపజయం కలిగిందంటే అది చాలా చిన్న విషయమే కేవలం మీరు చేసిన ప్రయత్నంలో చిన్న మార్పు జరిగిందంటే ఏమి పర్వాలేదు. మరో సారి ప్రయత్నించండి. ఒక అపజయం వంద విజయాలకు  నాంది, తొలిమెట్టుదగ్గిరే కుప్పకూలి పోతే జీవితంలో ఎక్కవలసిన మెట్లు అనేకం ఉన్నాయి. పడి ఎక్కడం, ఎక్కిపడటం సర్వసాధారణమైన విషయాలు.

మీరు గుర్తు పెట్టుకోవలసిన ముఖ్యమైన విషయం ఏమిటంటే అపజయాలనే అలవాటుగా చేసుకోకండి. అది మీ జీవితాన్ని ఇబ్బంది పెడుతుంది. మీరు అపజయం కలగటానికి గల కారణాలను వెతికి తెలుసుకోండి. మీరు చేసిన చిన్నపాటి లోపాలను సరిచేసుకోండి, ఒక





సారి చేసిన తప్పిదాన్ని ఎన్నటికీ చేయకండి, మీరు నిర్ణయం తీసుకున్నా తర్వాత పట్టుదల ఏదశలోను సడలకండి. ఈ విషయాలకు కట్టుబడి పనిచేయండి. అపజయం అనే పదం మీకు ఎన్నటికీ కనపడదు అన్నీ విజయాలే. అపజయంలో ఉన్న కసి మరిదేనిలో దొరకదు. ఏ వ్యక్తి అయితే ఆత్మాభిమానాలతో జీవిస్తుంటాడో ఆ వ్యక్తికి అపజయం కలిగితే అతని శక్తి వెయ్యి రెట్లు పెరుగుతుంది. మీరు కూడా ఆత్మాభిమానాలు కలిగి ఉన్నారని అనుకుంటున్నాను. ఇక మీకు తిరుగులేదు.

అపజయాలను పొందినప్పుడు ఉపాధ్యాయులు తల్లిదండ్రులు నిరుత్సాహపరచకుండా ఉండాలి. విద్యార్థులు చేసిన పొరపాట్లను సరిచేసి ప్రోత్సహించాలి. తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు నిరుత్సాహ పరిచారని ఎట్టి పరిస్థితుల్లో అవమానంగా భావించకుండా రెట్టింపు కసితో పని చేస్తే మీకు మంచి భవిష్యత్తు ఉంటుంది.



# బలహీన పరిచే విషయాలను త్యజించండి.

మీ దృష్టిలో విద్యార్థులను బాగా చదివేవారు,చదవని వారని రెండు రకాలుగా విభజించి ఉండవచ్చు. వారిలో బాగా చదివేవారికీ మీ ఓటు ఉండవచ్చు సరిగా చదవని వాడి పరిస్థితి అంతే మరి వారికి బడిలో, ఇంట్లో, సమాజంలో ఎవ్వరూ గౌరవం చూపించక పోగా చులకనగా చూస్తుంటూరు. మీరు తెలుసు కోవలసిన ముఖ్యమైన విషయం ఏమిటంటే ఈ ప్రపంచంలో పుట్టిన ప్రతివ్యక్తి ప్రతిచోట అసమర్ధుడుగా ఉండటానికిగల ప్రధాన కారణం అ వ్యక్తిలోని శక్తిని బయటకు రాకుండా అటంకపరిచే కొన్ని విషయాలుండటమే ఆ ఆటంకపరిచే విషయాలను ఎవరైతే ఎదిరించి తెగిస్తారో వారికి కష్టమైన పని,చేతగానివని అంటూ ఏదీలేదు. ఉదాహరణకు చెప్పాలంటే ఒక వ్యక్తిలో మంచి శక్తి సామర్ధ్యాలు ఉంటాయి. కాని ఆ వ్యక్తి తను సాధించలన్న లక్ష్యాన్ని చేరనీయకుండా కొన్ని బలహీన పరిచేవిషయాలు ఉంటా యి.ఒక్కొక్క వ్యక్తినివేరువేరు అంశాలు పట్టి పీడిస్తూఉంటూయి. వీటి వలలో పడిన ఎక్కువ మంది వ్యక్తులు ఏ లక్ష్యాన్ని కూడా సాధించలేక అందరిచేత అవమాణాలు పొందుతుంటారు.

ఏ వ్యక్తినైతే బలహీన అంశాలు అంటుకుంటాయో ఆ వ్యక్తి ఏమి చేయలేని నిస్సహాయి స్థితిలో ఉండిపోతాడు అప్పుడప్పుడు నేను అందరి చేత ఎందుకు మాటలుపడాలి.అని అనుకుంటారు.నేను





ఖచ్చితంగా మారతాను అనే సంకల్పం బయలు దేరినా వెంటనే ఆ బలహీన అంశాలు వెంటబడి మన ప్రయత్నాలు ఆటంక పరుస్తాయి.

ఏ విధ్యార్థి అయితే తన లక్ష్యాన్ని నెరవేర్చుకోవటానికి ఇబ్బంది పడుతుంటాడో ఆ విద్యార్థి ఖచ్చితంగా ఏదో ఒక వ్యసనానికి బానిస అయ్యి ఉంటాడు. ఆ వ్యసనం ఏ రూపంలోనైనా ఉండవచ్చు అదేమిటో గమనించి వానిపై దృష్టి పెట్టాలి నిజంగా నీ లక్ష్యానికి అది అడ్డుపడుతుందని తేలితే ఆ వ్యసనాన్ని విషంతో సమానంగా భావియించి దూరం చేయాలి. అంతే కాకుండా మనల్ని శారీరకంగా మానసికంగా బలహీనపరిచేది ఏదైనాసరే తృణప్రాయంగా త్రుంచివేయాలి. లేకుంటే మన జీవితానికి ప్రమాధం ఏర్పడుతుంది.

విధ్యార్థులను ముఖ్యంగా బలహీనపరిచే విషయాలు తెలుసుకోని విద్యార్థి ఏ విషయం మీద ఎక్కువ శ్రద్ధ చూపుతున్నాడు. శ్రద్ధ చూపిన విషయాలు మంచివా కావా అనే విషయాలను గమనించి మంచి కలిగించేది అయితే ప్రోత్సహించాలి. చెడుకలిగించేది అయితే దాని మీద అవగహన కల్పించి ఎప్పటికి ఆ విషయంజోలికి పోకుండా చెప్పవలసిన బాధ్యత తల్లిదండ్రులు మీద ఉపాధ్యయాలు మీద ఉంటుంది.



# ఇతరులను ఆకర్షించే విధంగా ఉండండి

ఇతరులను ఆకర్షించడం ఒక గొప్ప కళ, ఇది అందరికీ ఉండదు. ఈ కల వల్ల ఎన్నో ప్రయోజనాలు జరుగుతాయి. కొంత మందిని చూస్తే ఎప్పుడు దిగులుగా, చింతగా, వాడిపోయిన తోటకూరలాగా ఉంటారు. అటువంటి వారిని మనం ఎంతో మర్యాదగా పలకరించినాకూడా వాళ్ళు మనల్ని చీదరించుకుని, సక్రమంగా మాట్లాడరు. అటువంటి వారిని చూస్తుంటే దేవుడా ఇటువంటి వాళ్లు కూడా భూమి మీద ఉన్నారాఅని అనిపిస్తుంది. అటువంటి వారితో మనం ఎటువంటి విషయాలుకూడా మాట్లాడటానికి ఇష్టం చూపించలేము. ఇతరులను ఆకర్షించే కళ మనకు తెలియటం వలన అది ఎంతో ఉపయోగపడుతుంది. ఏవ్యక్తి అయితే ఇతరులను ఆకర్షించే గుణం కలిగి ఉంటారో ఆ వ్యక్తి తన అవసరాలను పనులను వెంటనే చేయించుకోగలడు. ఎంతో కష్టసాధ్యమైన పని కూడా సున్నితంగా చేసుకొని రాగలడు. సమాజంలో ప్రత్యేకమైన వ్యక్తులు కొందరు ఉంటారు. వారి పద్ధతే ప్రత్యేకం, వారు ఎవరి మాట వినరు, వారికై వారు తెలుసుకోలేరు. ఇటువంటి వ్యక్తులతో మనకు అవసరం ఏర్పడినప్పుడు సాధారణ వ్యక్తులు ఇటువంటి వ్యక్తుల నుండి పనులు చేయించుకోలేరు. కాని ఎవరైతే ఇతరులను ఆకర్షించే గుణం కలిగి ఉంటారో అటువంటి వ్యక్తులు వారి వద్ద పనులు చేయించుకోగలరు.



మనం ఇతరులను చేతల ద్వార, మాటల ద్వారా, చూపుల ద్వారా మన నడవడిక ద్వార, సందర్భ అనుకూలంగా ఇతరుల హావబావాలను తెలుసుకుంటూ, వారిని అంచాన వేసి వారికి నచ్చిన రీతిలో నడుచుకుంటూ ఒక చిరునవ్వు వేస్తే చాలు ఎంతటి వారైనా సరే మన మాట వినాల్సిందే ఏమాత్రం మన ప్రవర్తన శృతిమించితే మన స్థానం హిమాలయాల ఎత్తునుండి పాతాళానికి చేరుతుంది. ఇతరులను కలిసినప్పుడు ఎంతో జాగ్రత్తగా వ్యవహరిస్తే చాలు. అంతా మంచే జరుగుతుంది. ఏ వ్యక్తి ఇతరులను బాగా ఆకర్షించగలడో అటువంటి వ్యక్తికి శత్రువులు కూడా మిత్రులైపోతారు.

ఇతరులను ఆకర్షించే గుణం అలవాటు కావలంటే ఎక్కువ ఓపిక ఉండాలి. ప్రతి ఒక్కరితో మంచిగా ఉండాలి. చిరునవ్వు చెదరకూడదు. ఈ విషయాలను పాటిస్తే కొంత వరకు ఈ కళ అబ్బుతుంది. విద్యార్థుల్లో ఇతరులను ఆకర్షించే గుణాన్ని తల్లిదండ్రులు ఉపాధ్యాయులు తెలియచేసి విద్యార్థులను మంచి మార్గంలో పెట్టాలి.



# సమయానుకూలంగా నడుచుకోండి

ప్రతి వ్యక్తి తన జీవితంలోతెలుసుకోవలసిన ముఖ్యమైన విషయాలన్ని సమయానుకూలంగా నడుచుకోవడం అతి ముఖ్యమైన విషయం. సమయానికి అనుకూలంగా నడుచుకోవడం అనేది జ్ఞానంతోకూడుకున్న విషయం. మన జ్ఞానాన్ని ఎప్పుడు అయితే అభివృద్ధి పరుచుకుంటామో అప్పుడు సమయం సందర్భం తెలుస్తాయి. ఏ సమయ సందర్భాలలో ఎలా ఉండాలో తెలియకపోతే అంతే సంగతలు ఎన్నో ఘోరాలు జరుగుతాయి. సమజంలో కనీసం మనిషిగా కూడా భావించరు. మన తాతల కాలంలో చాలా మంది సరైన విద్యలేకపోయినా ఎక్కడ ఎలా మాట్లాడాలో ఎలా నడుచుకోవాలో ఏ సందర్భంలో ఏమి చేయాలో స్పష్టంగా చేస్తారు. కాని నేటి కాలంలో ఎంతో విజ్ఞానం అభివృద్ధి చెందింది. గతంలో కంటే అక్షరాసుల సంఖ్య అదికమైంది కాని కొంత మందికి కనీసం ఏసందర్భంలో ఎలా మాట్లాడాలో తెలియదు. వారు మాట్లాడిందే వేదం వేరే మాటలకు అవకాశంలేదు. ఎంత మంది చెప్పినా వినేది లేదు. నేను పట్టిన కుందేలుకి మూడేకాళ్ళు అనే విధంగా తయారయ్యారు. వాళ్ళు ఎంత మూర్ఖంగా మాట్లాడుతారో అంతే మూర్ఖంగా ఉంటారు. దీని వలన ఎంత ప్రమాధం ఎంత నష్టమో ఒక్క క్షణమైనా ఆలోచించరు. మన నోటిలో నుండి వచ్చే ప్రతి పదానికి అర్ధం ఉండాలి. ఎలా పడితే అలా ఎక్కడ పడితే అక్కడ మనం ఇష్టం





వచ్చినట్లు ప్రవర్తించకూడదు. మనకు వేపకాయ అంత వెర్రి ఉంటే అది మనకే నష్టం మన వెర్రిని ఇతరుల దగ్గర ప్రదర్శించటం చాలా పొరపాటు. మనలోచాలా మంది కొన్ని సార్లు పంతానికి వచ్చి మావాళ్ల చేసింది కరక్టే ఏం చేస్తారో చేసుకోండి అంటుంటారు. నిజానికి మన వాళ్లు చేసింది తప్పేకావచ్చు. ఇవి ఏమి ఆలోచించకుండా ఎలా పడితే అలాగే మాట్లాడటం చాలా పొరపాటు. కొంత మంది ఏదైనా బాధాకరమైన పరిస్థితుల్లో ఉండి నవ్వుతుంటారు. ఇలా ఎలా నడుచుకోవాలో తెలియని పరిస్థితుల్లో చాలా మంది ఉంటారు. అందరితో మంచిగా లేక పోతే మనకే నష్టం. మనకు సమాజంలో విలువ అనేది ఉండదు.

సందర్భాన్ని అనుకూలంగా నడుచుకున్నే విధానం మనం చిన్న వయస్సునుండి అలవాటుచేసుకోవాలి. తల్లి దండ్రులే మనకు మంచి గురువులు. పిల్లలను చిన్న వయస్సునుండి పెద్దలతో ఎలా మెలగాలి అనే విషయాలను నేర్పించాలి. పాఠశాలలో ఉపాద్యాయుడు సందర్భానికి అనుకూలంగా ఎలా నడుచుకోవాలి అనే విషయాలను ఉదాహరణలతో తెలిపి విద్యార్ధుల అభివృద్దికి దోహదపడాలి.



# వినయ విధేయతలు ప్రదర్శించండి

ప్రతి విద్యార్థి గొప్పతనం విద్యార్థులు ప్రదర్శించే వినయ విధేయతల మీద ఆధారపడుతుంది. ఉపాధ్యయుల పట్ల మనం చూపించే వినయ విధేయతలే మన భవిష్యత్తును నిర్ణయిస్తాయి. ఏ విద్యార్థి అయితే తన తల్లి దండ్రులను, ఉపాధ్యాయులను, పెద్దలను, పిల్లలను వినయ విధేయతలతో గౌరవిస్తారో అటువంటి విద్యార్థులు వాళ్ల మనస్సులో చిరస్థాయిగా ఉంటాడు. అటువంటి విద్యార్థుల కోసం వారు ఎటువంటి సహాయసహకారాలైన అందిస్తారు. ఇది ఒక మంచి లక్షణం మంచి అలవాటు. దానిని అలవరచు కోవడం ఎంతో మంచిది.

కొంత మంది విద్యార్థులు, పెద్దల పట్ల తొందర పాటు తనంగా ప్రవర్తిస్తారు, తల్లిదండ్రులను ఎదిరిస్తారు. ఉపాధ్యాయుల పట్ల అగౌరవంగా ఉంటారు. అటువంటి విద్యార్థుల జీవితంలో సాదించేది ఏమి ఉండదు. ఒక చెడ్డ పేరుతప్పా మనం ఇతరులలో మాట్లాడేటప్పుడు ఎటువంటి పరిస్థితుల్లో అగౌరవంగా, అసభ్య కరమైన పదాలతో మాట్లాడకూడదు. అది చాలా పొరపాటు. కాని చాలా మంది విద్యార్థులు, పిల్లలు చెడు స్నేహాల వల్ల తల్లిదండ్రుల పెంపకం సరిగా లేకపోవడం వలన ఇతరులతో అమర్యాదగా ప్రవర్తిస్తుంటారు. ఇలా చేయటం వలన వారికి





చెడ్డపేరు రావడంతో పాటు, వారి తల్లిదండ్రులకు, ఉపాద్యాయులకు నిందలు తెస్తుంటారు. ఒక పిల్లవాడు ఎప్పుడు కూడా పొగరుగా, దురుసుగా ఉండకూడదు. ఇలా అలవాటు అయిన వారు వారి అలవాట్లను మార్చుకోవడం మంచిది. ఇదే విధంగా కొనసాగితే ప్రమాదమే మరి.

మనం ఇతరులతో మాట్లాడేటప్పుడు ఎదుటి వారుతెలిసిన వారైనా తెలియని వారు అయిన మన పలకరింపు స్పష్టంగా, కపటం లేని విధంగా, వినయంగా, గౌరవంగాఉండాలి. అలా ఉంటేనే మనకు మంచి స్వభావం, మంచి గుణం ఉంది అని ఇతరులు గుర్తిస్తారు. మీరు ఎట్టి పరిస్థితుల్లో గుర్తింపుకోసం అలా చేయకండి మీ వ్యక్తిత్వం మారటం కోసం సమాజంలో మంచిగా జీవించటం కోసం అలా చేయండి మీరు వద్దు అని అనుకున్న కూడా ఆ గుర్తింపు వచ్చే తీరుతుంది.

సమాజంలో చెడ్డ పేరు తెచ్చుకోవడం సులభమే కాని మంచి విద్యార్థి, మంచి పిల్లవాడు అని అనిపించుకోవటం చాలా కష్టంతో కూడుకున్న పని మనం ఇతరులతో వినయ విధేయతలు ప్రదర్శించే తీరులో ఏ మాత్రం లోపం ఉండకూడదు. ఒక వేల మీరు నటిస్తున్నారని తెలిసిందా అంతే సంగతులు మీకు మంచి పేరు రావటం కాదు కదా వెంటనే మీకు చెడ్డపేరు వస్తుంది. నటించకండి ఆచరించండి. జీవించండి.

వినయ విధేయతలు నేర్చుకోవటం కూడా ఒక మంచి కళ. ఇది చిన్న తనం నుండి వస్తే మంచిది. తల్లిదండ్రులు తమ పిల్లలను చాలా పద్ధతిగా పెంచి పెద్దల పట్ల గౌరవభావాలు కలిగించాలి. అలాకాకుండా చాలా మంది తల్లిదండ్రులు తమ పిల్లలకు నేర్పించే మొదటి పాఠం. మీ బాబాయిలు, పెద్దనాన్నలు మనల్ని మోసం చేసారని, మీ మామయ్యలు, తాతయ్యలు మోసగాలని, తన తరుపు బంధువులందరిని మోసగాళని పరిచయం చేసి వారికి సరైన మర్యాద ఇవ్వకండి అని చెబుతారు. ఈ విధానం పిల్లవాడిని చెడిపేస్తుంది. ఈ విధంగా చెప్పని తల్లిదండ్రులు ఎవరైనా ఉంటే వారి పిల్లలు కొంత వరకు వినయ విధేయతలు చిన్న తనంలోనే వస్తాయి. వినయ విధేయతలు నేర్పించటంలో ఉపాధ్యాయులు,తల్లిదండ్రుల పాత్ర ముఖ్యమైనది.







## రోల్ మోడల్‌గా వ్యవహరించండి

ప్రతి విద్యార్థి తన జీవితంలో ఏదో ఒక రోజు రోల్‌మోడల్‌గా కావాలని అనుకుంటాడు. రోల్ మోడల్‌గా వ్యవహరించటం అంటే జీన్స్‌ప్యాంట్, టీషర్టు , షూ వేసుకుని తిరగటం కాదు. రౌల్ మోడల్ అనేది ఒక గొప్ప కళ అది నెరవేరాలంటే ఖచ్చితంగా నెరవేర్చుకోవచ్చు కాకపోతే కొన్ని పొందాలి అనుకుంటే కొన్ని వదిలేసుకోవాలి అన్నట్లు, మనం దేనిలో రోల్ మోడల్‌గా కావాలను కుంటామో దాని కోసం ఎంత శ్రమ చేయటానికైనా సిద్ధంగా ఉండాలి. మనం రోల్ మోడల్‌గా కావాలంటే మనకు ఏ విషయమైతే ఇష్టపడతామో ఆ విషయం నలుగురు నచ్చేదై ఉండాలి. ఆ విషయంలో మనం నిష్ణాతులంకావటమే అదే రోల్‌మెడల్‌గా ఎదగటానికి మంచి అవకాశం. మనం ఎంచుకున్న రంగంలో మనం విజయం సాధిస్తే అందరి కళ్ళు మన మీదే ఉంటాయి.

మీరు ఎంచుకున్నే విషయం ఏదైనా కావచ్చు పరీక్షల్లో మార్కులు ఎక్కువగా తెచ్చుకోవడం కావచ్చు లేక ఆటపాటల్లో అందరికన్న భిన్నంగా ఆడి గెలవటం కావచ్చు. లేక పాటలు పాడటం రచనలు రాయడం బొమ్మలు గీయటం ఏదైనా కావచ్చు మనం ఇష్టపడ్డ రంగంలో ఇతరుల కంటే భిన్నంగా వ్యవహరించి విజయం పొందితే చాలు అందరూ మీ వెంటే ఉంటారు. మీకు అభిమానులు అవుతారు. చరిత్రలో రోల్‌మోడల్‌గా ఎదిగిన ప్రతి వ్యక్తి ఏదో అద్భుతాలు సాధించిన వారే వారిలో నేతాజి, వివేకానందుడు, అబ్రహాంలింకన్, ఎడిసన్, టైసన్, సచిన్, జేసుదాసు,

ఇంకా ఎందరో ప్రత్యేకమైన గుర్తింపు తెచ్చుకున్నారు. సాధారణ పరిస్థితులలో రోల్ మోడల్గా కావలంటే మనం ఎప్పటికీ కాలేము మన ప్రతిభను సరికొత్తకోణంలో వెలికి తీస్తే వద్దన్నా మీ చుట్టు జనాలు ఉంటారు. మిమ్మల్ని ఆరాధిస్తారు. ఇంకా చెప్పాలంటే మీకు గుడులు కూడా కట్టిస్తారు. చూసారా రోల్మెడల్స్ అంటే ఎంత పిచ్చో మనం సాధించిన విజయాలను ప్రజలుతాము సాధించినట్టుగా భావించుకుని మనకు స్వర్ణకిరీటాలతో అబినందిస్తారు.

రోల్ మోడల్స్గా ఎదగటానికి విద్యార్థులకు ఎక్కువ అవకాశం ఉంది. తరగతిగదిలో అందరి కన్నా ఎక్కువ మార్కులు ప్రతిసారి తెచ్చికుంటుంటే అదే విద్యార్థి ఆటపాటల్లో ముందంజలో ఉంటే చాలు ఇక పిల్లలందరూ నీ చుట్టూ తిరుగుతారు. పాఠశాలలో ప్రారంభించిన ఈ రోల్ మోడలింగ్ ఎంతవరకైనా పోవచ్చు. బహుశ ప్రపంచ స్థాయి వరకైనా కావచ్చు. మన ప్రతిబే మనల్ని ఎంత స్థాయికైనా తీసుకెళ్ళుంతుది.

విద్యార్థులు రోల్మోడల్స్గా ఎదగటానికి ఉపాధ్యాయుల పాత్ర ఎంతో కీలకమైనది. విద్యార్థులను పరిశీలిస్తు వేటి మీద విద్యార్థి శ్రద్ధ చూపిస్తున్నారో గమనించి ఆ విషయంలో ప్రోత్సాహం అందిస్తే వారు ప్రతిభను చూపిస్తారు. ఈ విధానం చిన్నతనం నుండి ఆచరిస్తే ఎంతో మంచిది. తల్లిదండ్రులు కూడా పిల్లలను, వారి అభిరుచిని గమనించి వారికి ఇష్టమైన విషయాలను ప్రోత్సహించే విధంగా చేస్తే పిల్లలు గొప్ప స్థాయికి వస్తారు.





# జ్ఞానాన్నికలిగి ఉండడి

సమాజంలో మంచి గుర్తింపు కావాలనే ప్రతి ఒక్కరూ నిరంతరం పరితపిస్తుంటారు. కాని వారిలో కొందరికే మంచి గుర్తింపు లభిస్తుంది. మిగిలిన వారందరూ ఏదో ఒక లోపంతొ వెనుదిరగాల్సిందే. ఏ వ్యక్తి అయితే తనకు సంబందించిన అన్ని విషయాలలో జ్ఞానాన్ని సంపాదిస్తాడో ఆ వ్యక్తి జీవితభద్రతపై అటు ఇటు  తిరగవల్సిన అవసరం ఉండదు. జ్ఞానం అనేది ఒక మహాసముద్రం అది ప్రతి విషయంలోను ఉంటుంది. మన ఆలోచన జ్ఞానానికి దారి తీస్తుంది. ఎవరైతే ప్రతి విషయాన్ని ప్రత్యేక కోణంలో ఆలోచిస్తాడో ఆ వ్యక్తికి ఆ విషయంలో జ్ఞానం లభిస్తుంది. జ్ఞానం యొక్క లోతు లెక్కకట్టలేము. దానికి ఆది అంతము అనేది ఉండవు. నీ చదువులో జ్ఞానం దాగి ఉంటుంది. నీ చూపులో, నీ మాటలో, నీ నడవడికలో, నీ ఆలోచనలో, అంత ఎందుకు మనం చేసే ప్రతి పనిలో జ్ఞానం అనునది దాగి ఉంటుంది.

జ్ఞానాన్ని పొందాలంటే ప్రతి విషయాన్ని పరిశీలించాలి. ఈ విశ్వము అంతా జ్ఞానంలో నిండి ఉంది. ఈ అపారమైన జ్ఞానాన్ని పొందదానికి మనం నిరంతం ప్రయత్నించాలి. పోరాడాలి. జ్ఞానం మనిషిలోని అవివేకాన్ని తొలగిస్తుంది. సమాజంలో జరిగే ప్రతి విషయాన్ని అవగాహన చేసుకునే శక్తిని మనకు ఇస్తుంది. మన నడవడికను

మారుస్తుంది. మంచి గుణాలను కలిగిస్తుంది. మనం గొప్ప స్థాయికి రావడానికి సహకరిస్తుంది. మనలన్ని ప్రత్యేకమైన వ్యక్తులుగా మారుస్తుంది.

ఇటువంటి అద్భుత శక్తులను ఇచ్చేజ్ఞానం కోసం మనం ప్రయత్నించాలి. కాని, నేడు చాలమంది విద్యార్థులు, పిల్లలు తెలిసి తెలియక కొద్ధి కొద్ధి జ్ఞానంలో ఏం మాట్లాడుతున్నారో, ఏం చేస్తున్నారో, ఎలా ఉండాలో  తెలియని స్థితిలో ఉన్నారు. అంతేకాకుండా కనీస అవగాహన లేని విషయాలను సైతం వాదించడానికి ముందుకి వస్తారు. ఎవరైనా ఏదైనా విషయం చేబితే నాకు తెలుసులే అని స్పష్టమైన సమాధానం చెప్తారు. ఇటువంటి వాళ్లు ఏమి చెప్పిన వినని పరిస్థితిలో ఉంటారు.

ఒకరు చెబితే వినరు వారికై వారు తెలుసుకోరు సరిగదా సర్వం తెలుసు అని అజ్ఞానంలో ఉంటారు. ఈ విధానం మార్చుకోవాలి. ఇలా ఉండటం వలన వ్యక్తిత్వం దెబ్బతింటుంది. ఏ వ్యక్తి అయితే తన వ్యక్తిత్వం కోల్పోతాడో అతడు ఆత్మలేని శరీరంతో సమానం మనం జీవితంలో ఏమికోల్పోయినా సరే వ్యక్తిత్వం మాత్రం కోల్పోకూడదు. ఏవ్యక్తికైన సరే జ్ఞానంతోనే వ్యక్తిత్వం వస్తుంది. జ్ఞానం ఉన్న వ్యక్తి అన్నీ విషయాలలో అనిగి మనిగి ఉంటాడు. అజ్ఞానంతో ఉన్న వ్యక్తి మాత్రం అంతా తెలుసు అనే బ్రమలో ఉంటాడు. కావున మిత్రులారా ప్రతి విషయం మీద లోతైన జ్ఞానాన్ని పొందాకే మనం మిగతా వాటి గురించి మాట్లాడాలి.





జ్ఞానాన్ని పొందాలంటే ఓర్పుఉండాలి. మనం ఒక విషయాన్ని అన్నిరకాలుగా ఆలోచించినా అందులో వాస్తవాన్నికి మాత్రమే ప్రాధాన్యం ఇవ్వాలి. ఇలా యదార్ధన్ని తెలుసుకొనే ప్రయత్నం చేయండి. జ్ఞానాన్ని పొందే విషయంలో తల్లిదండ్రులు తమ పిల్లలకు జ్ఞానంతో కూడిన విషయాలను చిన్న వయస్సు నుంచి చెప్పడంతో పాటు, వాస్తవిక జీవితంలో పెంచాలి. అపోహలకు స్థానం ఇవ్వకూడదు. తరగతి గదిలో ఉపాధ్యాయుడు తమ పిల్లలకు జ్ఞానాన్ని పెంచే విషయాలను తెలియచేసి విద్యార్ధులను ప్రోత్సహించాలి.



# ఉన్నతమైన ఆలోచనలు చేయండి

ప్రపంచంలోని శాస్త్ర, సాంకేతిక, విజ్ఞానయంతా కేవలం మానవుని ఆలోచనలు నుండి పుట్టినదే ఆది మానవుని కాలం నుండి నేటి ఆధునిక మానవుని వరకు ఈ ప్రపంచంలో జరిగిన అన్ని మార్పులకు కారణం మానవుని ఆలోచనలే. ప్రపంచ చరిత్రలో ఆలోచన పూరిత చర్యలన్ని విశ్వశాంతికి దోహదం పలకగా, అనాలోచిత చర్యలన్ని ప్రపంచ వినాశనానికి దారితీస్తాయి. కావున ప్రియమైన మిత్రులారా మనలోని ఆలోచనలను జాగ్రత్తగా ఆలోచించండి. నిరంతరం మన మెదడులో ఎన్నో ఆలోచనలు వస్తుంటాయి. వాటిలో అద్భుతాలు చేసేవి ఉంటాయి. అందులో కొన్ని వృధా ఆలోచనలు కూడా ఉంటాయి. ఒక్క క్షణం మరళ ఆలోచించండి. ఈ ప్రపంచానికి అవసరమైన ఆలోచనలనే చేయండి. చరిత్రలో మీకంటూ ఒక స్థానాన్ని పొందండి. ఎటువంటి పరిస్థితులలో కూడా అనాలోచిత కార్యాలకు అవకాశం ఇవ్వకండి. అవి మిమ్మలన్ని, మీతో పాటు ఈ ప్రపంచాన్ని నాశనం చేయగలవు. జాగ్రత్త.

ముఖ్యంగా విద్యార్థులు ఎన్నో కొత్త ఆలోచనలను చేస్తు ఉంటారు. ఏదో ఒకటి కనుక్కోవాలని, మనకి ఒక గుర్తింపు సాధించుకోవాలని, శాస్త్రవేత్తల పక్కన వాళ్ళు పేర్లు కూడా ఉండాలని ఆలోచిస్తారు. దానికోసం ఎంతో ప్రయత్నం చేస్తుంటారు. వారి ఆలోచనలు





తాత్కాలికమైనవి కాకుండా, శాశ్వతంగా ఉండే విధంగా ఇతరుల సహాయం తోనేన వాటిని కార్యరూపం దాల్చేవిధంగా ఉండాలి.

విధ్యార్థులు తమ ఆలోచనలను ఎట్టి పరిస్థితిల్లో స్వల్పంగా బావించకూడదు. ఎప్పుడైతే మీ మీద మీకు విశ్వాసం తగ్గుతుంతో మీరు చేసే ఆలోచనలలో కూడా విశ్వాసం తగ్గుతుంది. అప్పుడు మీరు అనుకున్న పని నెరవేరక పోవచ్చు. మీరు చేసే ఒక్క ఆలోచనే మీ జీవితాలను మారుస్తాయి అనుకోకపోవడం కూడా పెద్ద పొరపాటే మనం చేసే అనేక మంచి ఆలోచనలో ఏదో ఒకటి మనల్ని గొప్ప స్థాయికి తీసుకుపోతాయి. ఇది నిజం.

కొంత మంది విద్యార్థులు చెడు స్నేహం వలన వారిఆలోచనలు కూడా చెడ్డవిగా ఉండవచ్చు. అటువంటి విద్యార్దులు వెంటనే తమ స్నేహితులకు వీడ్కోలు చెప్పడం మంచిది. మీరు మంచి ఆలోచనలను చేసి గొప్ప స్థాయికి రాకపోయిన పర్వాలేదు గాని చెడుఆలోచనలు చేసి చెడ్డ పేరు తెచ్చుకోవడం మంచిది కాదు. న్యూటన్ తన ఆలోచనలతోనే గురుత్వాకర్షణ శక్తిని కనుగొన్నారు. ఎడిసన్ తన ఆలోచనలతోనే బల్బు కనుకొన్నారు. ఇంకా ఎందరో తమ ఆలోచనలతో IASలు, IPSలు ఇంకా గొప్పగొప్ప మేధావులయ్యారు. కావున మన ఆలోచనలే, మన జీవితాలకు ఆధారాలు, తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, పిల్లల యొక్క ఆలోచనలను గమనిస్తూ, వాటిని సరిచేస్తూ, సమర్థిస్తుంటే పిల్లలు గొప్ప స్థాయికి వస్తారు.

# ప్రణాళిక అనుసరించండి

ఏదైన ఒక విజయం సాధించాలంటే ఎంత కష్టపడ్డమా అన్న దానికంటే, ప్రణాళికతో పని చేశామా అనేదే అవసరం. కష్టానికి వచ్చేది ప్రతి ఫలం అయితే, ప్రణాళికకు వచ్చేది విజయం. ఏ విజయానికైనా మూలకారణం ప్రణాళికే, ప్రణాళిక లేకుండా వచ్చేవిజయం తాత్కాలికమైతే, ప్రణాళికతో వచ్చేవిజయం శాశ్వతమైనది. దానికి తిరుగులేదు. ఏ పని అయినా ప్రణాళికతోనే సాధ్యం. ప్రియమైన విద్యార్థులారా మీరు చాలా సార్లు ఎంత కష్టపడినా మీ శ్రమకు ఫలితం దక్కక పోవచ్చు. దాంతో మీరు విసుగు చెంది విజయాలపైన ఆశలు వదులుకుంటారు. అలా ఎప్పటికి చేయకండి. మీరు ఏమి చేయాలనుకుంటారో అది ఖచ్చితంగా సాధించగలరు. మీకు సాటి ఎవరూ ఉండరు. అయితే మీరు చేసే పనిని మాత్రం ప్రణాళికతో చేయండి. ఒక విషయాన్ని నేర్చుకోవటానికి కొంత సమయం కేటాయించుకోండి. ఆ సమయాన్ని విభజించి మీరు నేర్చుకున్నే విషయాన్ని ఏఏ సమయాలలో ఏమి నేర్చుకోవాలో ముందుగానే నిర్ణయం తీసుకోని. తరువాత ప్రారంభించండి. మీకు తిరుగులేదు. మిమ్మల్ని విజయం వరిస్తుంది. ఓటమి అంటూ మీరు ఎరుగరు. ఎట్టిపరిస్థితుల్లో మీరు అనుకున్న సమయాన్ని రాజీపడి మార్చకండి. ఎన్ని ఇబ్బందులు వచ్చినా సరే. ఎన్ని సమస్యలు ఎదురైనా సరే మీరు అనుకున్నది సాధించే వరకు





నిద్రపోకండి. మీ పట్టుదలను సడలకండి. మీ విజయం అనేది మీ పట్టుదల మీదే ఆధారపడి ఉంటుంది. మీ పట్టుదలకు ప్రణాళిక తోడ్పడితే చాలు అపజయం అనే మాట మీరు ఎప్పటికి వినరు. ప్రతి విద్యార్థి, ప్రతి విషయంలోను, ప్రణాళికతోనే నడుచుకోవాలి. ప్రణాళికతో పని చేయడం మీకు చిన్న తనం నుండి అలవరుచుకోవాలి. ఇది మీ జీవితంలో ఒక బాగంగా కావాలి అప్పుడే మీకు సమాజంలో గుర్తింపు వస్తుంది. దీనితోనే మీకు మంచి క్రమశిక్షణ వస్తుంది.

తల్లిదండ్రులు పిల్లలను చిన్న తనం నుండి ప్రణాళికా బద్ధంగా పెంచాలి. ప్రతి విషయాన్ని క్రమబద్దంగా నేర్పించాలి.ఎటువంటి పరిస్తితుల్లో రాజీ పడకూడదు. తల్లిదండ్రులు పిల్లల విషయంలో రాజీపడితే పిల్లల భవిష్యత్తుకే ప్రమాదం ఏర్పడుతుంది. దయచేసి రాజీపడకండి. తరగతి గదిలో ఉపాధ్యాయుడు విద్యార్థులకు ప్రణాళిక యొక్క గొప్పతనాన్ని తెలియచేయాలి. పిల్లల్ని క్రమశిక్షణాయుతంగా అభివృద్ధిచేయాలి. ప్రణాళికతో ఉన్న వ్యక్తిని మాత్రం విజయాలు ఎప్పూడూ వరిస్తాయి.



# నిగర్విగా ఉండండి

మనం చేసే ప్రతి పనిని ఈ సమాజం నిరంతరం గమనిస్తూ ఉంటుంది. మన మాట తీరును, మన ప్రవర్తనను అన్నింటిన్నీ చూస్తుంది. ఏ వ్యక్తి అయితే తాము చేసిన పనిని ఆర్భాటలు లేకుండా చేస్తాడో ఆ వ్యక్తిని ఒక కోణంతోను, ఏ వ్యక్తి అయితే తాను చేసిన పనిని ఆర్భాటంగా చేస్తాడో ఆ వ్యక్తిని మరో కోణంతోను ఈ సమాజం చూస్తుంది. మనం ఏ పని చేసినా దాంట్లో గర్వం లేకుండా వినయంగా ప్రకటిస్తే ఈ సమాజం మనల్ని ఎప్పుటికీ కాపాడుతుఉంటుంది. మనం చేసే పనిని గర్వంతో చేస్తే ఈ సమాజం మనల్ని ప్రత్యేకమైన వ్యక్తిగా చేస్తుంది. మీరు చేసే పనిలో గర్వాన్ని ప్రకటించ వద్దు ఈ పని నేను మాత్రమే చేయగలను. నా ఒక్కడి వల్లనే అవుతుంది. " నా అంతటి వాడు ఈ ప్రపంచంలో ఎవ్వరూ లేరు. నన్ను మించిన మేధావి ఎవ్వరు లేరు అనే మాటలకు కళ్ళేం వేయండి మీరు ఎంతటి అద్భుత విజయాలను సాధించినా సరే గర్వంలేకుండా ఉండండి. మంచిగా మాట్లాడాడి గర్వాన్ని తుంచివేయండి. అదే మనకు మంచి చేస్తుంది.

కొంత మంది సాధించింది కొంచెం అయితే చెప్పుకునేవి కొండంత మరి కొంత మంది ఏమి సాధించకుండాన్నే అంతా సాధించేసాను నాకు ఇక తిరుగులేదు అని అమాయకపు మాటలు చెబుతుంటారు. గర్వం లేకుండా ఉండటమంత ఉత్తమం ఏమీ లేదు.





నీ మంచితనమే నిన్ను కాపాడుతుంది సమాజం హర్షిస్తుంది. గర్వపోతులకు ఈ సమాజంలో గుర్తింపు ఉండదు. వారిని అందరూ దూషిస్తారు. కలలో కూడా గర్వంగా ఉండకండి.

కొంత మంది తల్లిదండ్రులు తమ పిల్లలు సాధించిన విజయాలను గర్వంగా చెబుతుంటారు. అటువంటి వారు సగర్వంతో అందరిలాగానే మా పిల్లవాడు కూడా విజయం సాధించాడు అని ప్రకటిస్తే హర్షించవచ్చు. అలా కాకుండా మా పిల్లవాడు ఒక్కడే సాధించాడు అంటే ఈ ప్రపంచం చాలా విశాలమైనది. ఎందరో ఇటువంటి విజయాలను ఇది వరకే సాధించే ఉంటారు. అది గ్రహించాలి.

ప్రతి వ్యక్తి తమకు తెలియకుండాన్నే కొన్ని విషయాలలో కొన్ని సార్లు గర్వం ప్రకటిస్తుంటారు. పాఠశాలల్లోగాన్ని, ఇంట్లో గాన్ని, స్నేహితుల దగ్గరగాన్ని, బంధువుల దగ్గరగాన్ని, కొత్త వ్యక్తుల వద్ధగాన్ని, ఇలా చేస్తుంటారు ఉన్న విషయలు చేప్పుకోవచ్చు గాని, ఉన్న విషయాలకి కొంచెం మసాలా జోడించి చెప్పటం మంచిది కాదు. ఏది ఏమైనా నిగర్విగా ఉండటం అంత ఉత్తమం మరోకటిలేదు.

ఉపాధ్యాయుల తల్లిదండ్రులు పిల్లలకు పాఠశాలల్లోను, ఇంట్లోను చక్కటి మాటలు చెబుతూ చిన్నతనంనుండి గర్వం లేకుండా పెంచాలి. గర్వం వలన కలిగే నష్టాల గురించి తెలియచేయాలి. పిల్లవాడికి మానసిక శక్తిని కలిగే విధంగా తయారు చేయాలి.



# అనవసర విషయాల జోలికి వెళ్లకండి

మీరు ఈ ప్రపంచంలో ఏమి సాధించిన, సాధించకపోయిన్నా సరే అనవసర విషయుల జోలికి ఎట్టిపరిస్థితుల్లో వెళ్ళకండి ప్రస్తుత రోజుల్లో మనం మంచి చేస్తేన్నే చాలా సమస్యలు వస్తున్నాయి. అటువంటప్పుడు మనది కాని విషయాల జోలికి వెలితే ఇక అంతే సంగతలు చాలా మందికి ఒక అలవాటు ఖచ్చితంగా ఉండి తీరుతుంది మన చుట్టు ప్రక్కల జరిగే అనేక రకాల చర్యల్లో మనకు సంబంధం లేకపోయినా వెంటనే మనం కలిగించుకుని పోతుంటాం.

అటువంటి చర్చలోన్నే పెద్ద గంధర గోళం కూడా ఏర్పడవచ్చు. అదే పెద్ద సమస్యకు దారి తీయవచ్చు. ప్రతి సారి అలా జరగక పోయినా ఏదో ఒకసారి మాత్రం ఖచ్చితంగా జరిగే తీరుతుంది. నిజానికి అది మన కుటుంబ వ్యవహారం కాదు,లేక దేశ సమస్యకు పరిష్కారం కాకపోవచ్చు. కాన్ని మనం అటువంటి చర్చల్లో తలదూరిస్తే సమస్య ఎంత దూరం పోతుందో ఊహించలేము.

కొంత మంది అనవసర విషయాల జోలికి వెళ్ళకూడదని నిర్ణయించుకుని యాదార్ధంగా ప్రవరిస్తుంటారు. తన సమీపంలో జరిగే ఒక సమస్యను తాను సులభంగా పరిష్కరించే తెలివితేటలున్నా కూడా నాకెందుకులే అనే వారు లేక పోలేదు. అలా ఉండటం కూడా మంచి పద్ధతికాదు, మనం ఎటువంటి విషయాలలో పాల్గొనవచ్చు ఎటువంటి





విషయాలల్లో పాల్గొన కూడదు అనే కనీస పరిజ్ఞానం పొందటం ప్రతి వ్యక్తి కర్తవ్యం ఎవరికి వారు మాకు అనవసరం అని అంటే ఈ సమాజం ఏమి అవుతుంది ఒక్క సారి ఆలోచించండి.

మనం ఏ పనిచేసినా అర్ధవంతంగా ఉండాలి అర్ధం లేని పనులు చేస్తే మనకే సమస్యలు వస్తాయి. ఎటువంటి చర్యలలో తలదుర్చాలి. ఎటువంటి విషయాలలో తలదూర్చకూడదు అనే విషయాలను తల్లిదండ్రులు చిన్నతనం నుండి పిల్లలకు నేర్పించాలి. సందర్భాన్నికి అనుకూలంగా ప్రవర్తించే తీరును తెలియచేయాలి. ఇటువంటి విషయాలు కొన్ని సార్లు ఎంత తీవ్రరూపం దాలుస్తాయో తెలియిచేసే నీతి కథలు చెప్పాలి. తరగతి గదిలో ఉపాధ్యాయుడు పిల్లలతో చర్చకార్యక్రమాలు ఏర్పాటు చేసి పిల్లలను చర్చలలో పాల్గొనేలా చేయాలి. విద్యార్ధులకు ఎటువంటి విషయాలలో కల్పించుకోవాలి. ఎటువంటి వాటి జోలికి వెళ్ళకూడదు, అనవసరం విషయాల వల్ల కలిగే నష్టాలేంటి అనే విషయాలను తెలియ పర్చాలి.



# బాల్యం బలి అవుతుంది

తెల్లగా తెల్లారింది లెయ్యండయ్యా,లెయ్యండమ్మా హోం వర్క్ చేసుకోవాలి, చదువుకోవాలి అని తెల్లవారి జామున నాలుగు గంటలకు అమ్మ నిద్ర లేపుతుంది అక్కడితో ప్రారంభమయి,రాత్రి పదకొండుగంటలకు నిద్రపోయే వరకుబాల్యం బలిఅవుతూ ఉంది. ఉదయం బడికి బయలుదేరాటానికి కనీసం గంటల సమయం పడుతుంది. ఉదయం టిఫిన్ తినటానికి కూడా సమయం దొరకటంలేదు సమయంలేక ఒక పక్క అమ్మ అన్నం కలిపి నోట్లో పెడుతుంటే,పిల్లలు బట్టలు వేసుకోవడమో లేదా పుస్తకాలు సర్ధుకోవడమో చేస్తుంటారు. చాలిచాలని తిండితో కడుపునింపుకుంటున్నారు.కేజీలబ్యాగు బుజాన వేసుకోని చూడటానికి బియ్యం బస్తాలు మోసేవాడిలా కనిపిస్తూ ఆ బ్యాగ్‌ను మోయలేక మోస్తూ, ఈడ్చుకుంటూ బడికి వెళ్ళుతున్నారు.

బడిలో టీచర్లు బోలెడు హోమ్‌వర్కు ఇస్తారు. సాయంత్రం ఇంటికి వచ్చిన తర్వాత  వెంటనే స్టడీకి పంపిస్తారు స్టడీ అనంతరం ఇంటికి వచ్చి కొంచెం టి.వి. చూద్దాం అనుకునే సరికి, హోంవర్క్‌లు చేయండి అంటూ ఆర్డర్లు వేస్తారు ఈ విధంగా విద్యార్ధి బాల్యం బలి అవుతుంది.ప్రతి మనిషి జీవితంలో అత్యంత విలువైనది. జీవితంలో ఎన్నటికి తిరిగి రానిది బాల్యం, బాల్యాన్ని బలిచేసే హక్కు ఈ ప్రపంచంలో ఎవ్వరికీ లేదు చంద్రుడిలోని చల్లధనం, మల్లెలో తెల్లదనం





ఎంతటి స్వచ్ఛమైనవో బాల్యంలోని తీపిగుర్తులు అంతే స్వచ్ఛమైనవి. ఎటువంటి పాపం,పుణ్యం తెలియని కల్మషంలేని బాల్యం నేటి విద్యావ్యవస్థ వలన బలి అవుతుంది. బాల్యంలో ఆడే బాల్యక్రీడలు, ప్రశాంతత, మనశాంతి,ఆనందం, ఆహ్లాదం,స్వేచ్ఛా దోచేస్తున్నారు. ఈ విధానం వల్ల బాల్యలోనే పిల్లలపై భారం,ఏర్పడి వ్యక్తిత్వం కోల్పోయి ఒక యంత్రంగా మారుతున్నారు. ఈ విధానానికి స్వస్థి చెప్పి బాల్యాన్ని బాల్యంగానే అనుభవించే విధంగా చెయ్యాలి.

అనవసరపు భారాలు పిల్లలపై ఉంచకూడదు, సామర్ధ్యాన్ని బట్టి నడుచుకోవాలి, పిల్లలనుపూర్తిగా స్వేచ్ఛా వాతవరణంలో క్రమశిక్షణాయుతంగా పెరగనివ్వాలి. ఈ విధంగా పెరిగిన విద్యార్ధులు జీవితంలో ఉన్నత లక్ష్యాలను చేరుకోవడంలో ఎక్కువ శ్రమ చేయనవసరం ఉండదు.త్వరగా లక్ష్యాలను చేరుకుంటారు, బాల్యాన్ని బలి చేసుకున్న విద్యార్ధులు లక్ష్యాలను చేరుకోవటానికి ఎక్కువ శ్రమ చేయవలసి వస్తుంది. మానసిక సామర్ధ్యలు తక్కువగా ఉంటాయి. అందువలన ప్రతి తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు పిల్లలను ఎంతో సంస్కార యుంతంగా, ప్రశాతంగా పెంచవలసిన బాధ్యత ఉంటుంది.



# తల్లిదండ్రులు తెలుసుకోవలసిన విషయాలు

చాలా మంది తల్లిదండ్రులు తమ పిల్లలు బాగా గొప్ప స్థాయికి రావాలని అనుకుంటారు. సమాజంలో మిగతా వారికన్నా తమ పిల్లలు అన్నింటిలో ముందు ఉండాలని అనుకుంటారు. అందుకు వారు తమ పిల్లలను ఎంతో శ్రద్ధగా పెంచుతూ పిల్లలకు ఏమి కొరత లేకుండా చూస్తుంటారు. ఇదే క్రమంలోతల్లిదండ్రులు పిల్లలపై అధిక భారం వేస్తుంటారు పిల్లల యొక్క స్వేచ్ఛను పూర్తిగా అరికడతారు వారి భావాలకు విలువనివ్వరు. పిల్లలను మంచి మార్గంలో పెడుతున్నామని అంటూనే పిల్లలచేత చేయించకూడని పనులు చేయిస్తూంటారు. బాగా చదవాలనే ఉద్ధేశ్యంలో 24 గంటలు వేదిస్తుంటారు. చెడు స్నేహం చేయకూడదన్ని ఎవరితో కలవనివ్వరు. పిల్లలను ఇతరుల ముందు మావాడు పనికిరాడు, చెప్పిన మాట వినడు అని తిడుతుంటారు.

ఇటువంటి పద్దతులన్నీ పిల్లవాన్ని గొప్ప స్థాయికి తీసుకురావటం పక్కన పెడితే పిల్లవాడు అధోగతి పాలవటం తథ్యం. పిల్లల్లో మానసికంగా అటువంటి భావాలు నాటుకపోయి పిల్లవాడు తల్లిదండ్రులు చెప్పేమాటలకు వ్యతిరేకంగా చేయటం మొదలు పెడతాడు. ఎవరితో తిరగవద్దు అంటే వాడితోనే తిరుగుతాడు. బడికి వెళ్ళమంటే బడికి వెళ్ళడు. అబద్ధాలు ఆడకొడదంటే అబద్ధాలు ఆడతారు. ఈ విధంగా అన్ని రకాలుగా వ్యతిరేఖ విధానంలో పనిచేస్తుంటారు. తల్లిదండ్రులు నియంతృత్వభావాలు వదులుకొని పిల్లవాడిని మంచి మనుస్సుతో మార్చాలి. పిల్లల యొక్క భావాలకు విలువ ఇవ్వాలి. పిల్లలు కోరుకునే విషయాలు మంచివా చెడ్డవా అని ఆలోచించి దాని వలన కలిగే ఫలితాన్ని పిల్లలకు తెలియచేసి మంచి





మార్గంలో నడిచేవిధంగా తయారుచేయాలి. కొంత మంది తల్లిదండ్రులు తమ పిల్లలపై విశ్వాసం ఎక్కువగా ఉంచుతారు. పిల్లలు ఎక్కడైనా తప్పుచేస్తే తమ పిల్లలు తప్పుచేసారా లేదా అని తెలుసుకోకుండానే తమ పిల్లలను సమర్థిస్తారు. మాపిల్లలు ఎప్పుడు తప్పుచేయరు అని అంటారు. ఈ విధనం వల్ల మన పిల్లలు బాగుపడక పోగా ఇంకా కొంచెం చెడిపోవడానికి అవకాశం ఎక్కువ. ఇలాంటి తల్లిదండ్రులవల్ల పిల్లలు తాము ఏమి తప్పుచేసినా కూడా మ తల్లిదండ్రులు మాకు సపోర్టుగా ఉంటారు కదా మాకేమిలే అనే విశ్వాసంతో మరెన్నో తప్పులు చేస్తుంటారు. అందువలన తల్లిదండ్రులు వద్దకు తమ పిల్లలపై ఎవరైనా ఫిర్యాదు చేస్తే వెంటనే మీరు సమర్థించకుండా పిల్లలను పిలిచి పూర్తి వివరాలు సేకరించి తప్పుచేశారా లేదా అని తెలుసుకొని పిల్లలతో మంచిగా మాట్లాడి రెండవ సారి ఇటువంటివి చేయకూడదని చెప్పి తప్పుచేస్తే కలిగే ఫలితాన్ని వివరించి పిల్లవాడిలో మానసిక పరివర్తన తీసుకురావాలి ఇలాచేస్తే పిల్లవాడు తమ జీవితంలోతప్పే చేయడు.

ఒక పిల్లవాడి ప్రవర్తన ఆ పిల్లవాడి తల్లిదండ్రులు మీదే ఆధారపడుతుంది. చిన్న తనం నుంచి పెంచే పెంపకమే పిల్లవాడి నిండు నూరేళ్ళజీవితం ఆధారపడి ఉంటుంది. పిల్లలకు నీతికతలు, ఆధ్యాత్మిక విషయాలు అధికంగా నేర్పించాలి. మంచి మర్యాధ, నిజాయితీ, ధైర్యం వంటి విషయాలు చిన్న తనం నుండి నేర్పించాలి. ఏ పిల్లవాడైతే క్రమ పద్ధతిలో విలువలు నేర్చుకుంటూ పెరుగుతాడో అటువంటి వ్యక్తికి ఈ సమాజంలో తిరుగేలేదు.

ప్రస్తుత రోజుల్లో చాలా మంది తల్లిదండ్రులు పిల్లల పెంపకం విషయంలో చాలా శ్రద్ధచూపుతున్నాం అని చెప్పుకుంటున్నావారి పెంపకంలో విలువల కొరత ఏర్పడింది అనే విషయం అర్ధమవుతుంది. నేటి సమాజంలో జరిగే అన్యాయాలు అక్రమాలు, దౌర్జన్యాలు ఇంకా

ఎన్నో రకాల భయంకరమైన నేరవిషయాలు అన్నీ కూడా మనుషులు చేసినవే. ఆ మనుషులు కూడా ఒకనాటి పిల్లలే వారు చిన్న తనంలో చేయని నేరాలు పెద్దఅయిన తరువాత చేశారంటే వాల్ల పెంపకంలో మానవతావిలువలు లోపించడమే కారణం అవుతుంది. తల్లిదండ్రులు తమ పిల్లల పెంపకంపై ప్రత్యేక శ్రద్దతో స్వేచ్ఛాపూరితమైన వాతావరణంలో పిల్లవాడి భావాలకు విలువనిస్తూ శాంతియుతమైన మార్గంలో పెంచితే ఈ సమాజంలో అవినీతి అక్రమాలు అనేవి మనం చూద్దాం అని అనుకున్న చూడలేము. ఒక పిల్లవాడు చెడిపోయాడంటే దానికి కారణాలు ఎన్ని కనిపించినా దానికి పునాది మాత్రం తల్లిదండ్రుల పెంపకమే అని చెప్పాలి. ఒక ఆదర్శవంతమైన వ్యక్తిగా సమాజంలోకి రావాలంటే పెంపకమే కీలకమైనది. ఇంతటి నాణ్యమైన పెంపకానిచ్చే తల్లిదండ్రులు ఎంత ఉన్నతంగా ఉండాలో ఆలోచించండి. మొదట తల్లిదండ్రులు మీరు ఇప్పటివరకు ఎలా ఉన్నా సరే ఎలా పెరిగినా సరే మీపిల్లలను పెంచే విషయంలో ఎంతో స్పష్టత అవసరం పిల్లవాడిని వజ్రంలా చేయటమే తమ జీవితలక్ష్యం అయ్యి ఉండాలి. ఒక పిల్లవాడిని వజ్రంలా చేయ్యాలంటే ఆస్థులు అంతస్థులు, వజ్రవైడూర్యాలు, బంగారాలు, నగలు అవసరం లేదు. అందుకు కావలసింది కేవలం నైతిక విలువలతో పెంచితే చాలు. ఈ ప్రపంచం మొత్తం ఒక దేశంగా మారిపోతుంది. అప్పుడు ఎక్కడా అన్యాయం అంటూ ఉండదు. మనుషులంతా ఒకే కుటుంబంగా, ఒకే జాతిగా జీవిస్తారు. ఇంతటి మహత్తరమైన కార్యం తల్లిదండ్రుల చేతుల్లోనే ఉంది. తల్లిదండ్రులు ఆర్థిక ఇబ్బందులు పిల్లలతో చర్చించకండి.

"ఇతరుల లోపాలను వేలెత్తిచూపకండి. !
పిల్లలముందు చెడు పనులు చేయ్యకండి !!"





## తల్లిదండ్రులను, వేదించే పిల్లలు

కొంతమంది తల్లి దండ్రులు ఎవ్వరికీ చెప్పలేనంత బాధ అనుభవిస్తూ ఉంటారు దానికి కారణాలు అర్థిక సమస్యలున్నా ఆరోగ్య సమస్యలున్నా ఇంకా అనేక రకాలు సమస్యలున్నా వాటన్నింటిని సైతం అధిగమిస్తారేమో గాని తమ పిల్లల నుంచి ఎదురయ్యే సమస్యలే ఎక్కువగా తల్లిదండ్రులనుకృంగతీస్తుంటాయి, తల్లిదండ్రులు ఎన్నో ఇబ్బందులు పడి పిల్లలను చదివించాలని అనుకుంటుంటే పిల్లలు మాత్రం వారి ఆశలను నిరాశలుగానే మిగులిస్తుంటారు. కొంత మంది పిల్లలు తల్లిదండ్రులను మానసికంగా చిత్ర హింసలకు గురిచేస్తూ బెదిరిస్తుంటారు. తల్లిదండ్రులు వారి పిల్లలను ఏమి చేయ్యలేని నిస్సాయ స్థితిలో ఉంటారు. పిల్లలు ఇంట్లో చేసే తప్పులే కాకుండా బయట కూడా అనేక తప్పులు చేసి వాటన్నింటిని ఇంట్లో తల్లిదండ్రుల మీదకు వచ్చే విధంగా చేస్తుంటారు ఇలా చేయడం వలన తల్లిదండ్రులు మానసికంగా కృంగిపోతు కొన్ని సార్లు అత్మ హత్మలు చేసుకునే పరిస్థితులు కూడా వస్తాయి. ఇటు వంటి పిల్లలు ముఖ్యంగా 13 నుండి 25 సం॥లోపు వయస్సుగల వాల్లు ఉంటారు. వీరు జీవితంలో ఏమి సాధించలేరు. ఇటువంటి వారు ఖచ్చితంగా మారాలి. అలా మారాలంటే కుటుంబ వ్యవహారాలలో చురుకుగా పాల్గొనాలి, కుటుంబ సమస్యలును తమ సమస్యగా గుర్తించాలి తల్లిదండ్రుల పరువు మీద ఆధార పడే తన పరువు ఉంటుందని తన పరువు మీద ఆధారపడే తల్లిదండ్రుల పరువు ఉంటుందని గ్రహించాలి.

## తల్లిదండ్రులు, పిల్లల నుండి కోరుకునేవి

1. మా పిల్లవాడు అందరి కన్నా ఫస్ట్ రావాలని.
2. పాఠశాలలో చేర్పిస్తే మా పిల్లలకే ఎక్కువ మార్కులు రావాలని
3. పాఠశాలలో అందరికన్నా భాగా చదవాలన్ని, కోరుకుంటుంటారు.

నేడు సమాజంలో తల్లిదండ్రులు తమ పిల్లల భవిష్యత్తుపై ఎన్నో ఆశలు పెట్టుకుని జీవిస్తున్నారు. మా పిల్లలు గొప్ప స్థాయికి,వచ్చి సమాజంలో గొప్పపేరు సాధించాలని, అర్థికంగా బాగా ఎదగాలని కోరుకుంటారు. కాని వారి ఆశలకు తగినట్లుగా పిల్లవాడిని పెంచు తున్నారా అంటే కొంత మంది ఆ పెంచుతున్నాము వాడు అడిగినవి అన్నీ కాదనకుండా ఇస్తున్నాము. కాని వారు మా మాట వినడం లేదు. మేము ఏదైతే చేయకూడదంటమో అదే చేసి తీరుతాడు మేము బాగానే పెంచుతున్నాము కాని వాడు పిల్లల స్నేహన్ని బట్టి చెడిపోతున్నాడు అంటారు. ఏది ఏమైనా గాని పిల్లలు అడినవి అన్నీ కాదనకుండా తెచ్చి వాడి ఇష్ట ప్రకారమే నడుస్తున్నాము అంటారు. ఇదే సరైన పెంపకమా అంటే కాదని చెప్పాలి లేక పిల్లవాడిని నయానో బయాన్నో మీ మాట వినే విధంగా చేస్తున్నారుగాని. పిల్లవాడికి మానసికంగా,శారీరకంగా,బుద్ధిపర్వంగా, మార్చేకోణంలో మనం ప్రయత్నించటంలేదు. పిల్లవాడిని ఎప్పుడైతే మానసికంగా మార్పు తీసుకురాగలమో అప్పుడే ఆ పిల్లవాడు మంచి మార్గంలో ఉండాటానికి అవకాశం ఏర్పడుతుంది. తల్లిదండ్రుల ప్రమేయంలేకుండా తనంతట తానుగా మార్పు చెందిననాడు ఆ విధ్యార్థికి జీవితంలో అన్నీ విజయాలే.





## జాగ్రత్తలు పాటించండి

పిల్లలు తమ జీవితంలో అత్యున్నత స్థాయికి చేరటానికి తల్లిదండ్రులు ప్రాత ఎంతో ముఖ్యమైనది. పిల్లల ఉత్తమ భవిష్యత్తు ఆలోచించే ఏ తల్లి దండ్రులైనా మంచిగానే ఆలోచిస్తారు. ఎంత మంచిగా ఆలోచించినా కొంతమంది పిల్లల భవిష్యత్తు అభివృద్ధికి నోచుకోలేక పోవటం మనం చూస్తుంటాం దీనికి గల కారణం తెలుసుకోవలసిన బాధ్యత ప్రతి తల్లిదండ్రులపై ఉంటుంది. పిల్లలను ఉన్నత స్థాయికి తీసుకురావాలని అనుకుని తల్లిదండ్రులు పిల్లల విషయంలో చిన్నతనంనుంచి శ్రద్ధ వహించాలి. పిల్లల మానసిక పరిస్థితిని అంచనా వేయగలగాలి, ఆరోగ్యస్థితిని, అలవాట్లను, అకర్షణలను తెలుసుకోవాలి. ఇష్టా ఇష్టాలను, ప్రేరణను, సంతోషాలను, బ్యాధతలను గమనిస్తూ ఉండాలి. చిన్నతనం నుంచె మెదడును చురుకు తనంగా ఉండే విధంగా పెంచాలి. ఆలోచనా శక్తిని పెంచే వస్తువులను ఇవ్వాలి. పదే పదే చేసే తప్పులను చెయ్యనివ్వకుండా ఉండాలి. చేసిన తప్పులను సమర్ధించకుండా మరో సారి తప్పుజరగకుండా చూడాలి. ప్రేమ పూర్వకమైన వాతవరణంలో మందలింపు ఉండాలి పిల్లలకు చికాకు, భయం, ఆంధోళన కలిగే విధంగా మందలింపు ఉండకూడదు. ఏదైన ఒక తప్పు జరిగితే ఆ తప్పు యొక్క ఫలితాలు ఎలా ఉంటాయో తెలియచేయాలి. తల్లిదండ్రులు తమ వ్యక్తిగత సమస్యలను పిల్లలపై రుద్దరాదు. ఎన్ని సమస్యలున్నా వాటని పిల్లలముందు బహిర్గతం చేయరాదు. పిల్లల ముందు ప్రేమగా ఉండాలి. ఉన్నత లక్ష్యాలను

పిల్లలకు చిన్న తనం నుంచే నూరిపోయాలి. వారి వయస్సుకు తగినట్లు లక్ష్యాలు కల్పించి వాటిని చేరుకోవటానికి మార్గ దర్శకులుగాఉండాలి. లక్ష్య సాధనలో ఎదురయ్యే సమస్యలను గురించి వివరించి వాటిని ఎదురుకునే మార్గాలను చూపించాలి. పిల్లలో ఏర్పడే సాధరణ సామాజిక బయాలను, అపోహలను, మూఢ నమ్మకాలను, ద్వేషాలను, ఒంటరి తనాన్ని తొలగించాలి.

ప్రతి ఒక్కరితో స్నేహ పూర్వకంగా ఉండే విధంగా చేయాలి. ధైర్యాన్ని ఆధ్యాత్మికతను, ప్రేరణను, ఆత్మ విశ్వాసాన్ని, కల్పించాలి నాయకత్వ లక్షనాలను కలిగించే విధంగా పెంచాలి. పిల్లలకు మానసిక సంసిద్ధతతో పాటు ఆరోగ్యభద్రత, సామాజిక భద్రతల గురించి తెలియచేయాలి. ఇటువంటి అన్నీ అంశాలను క్రమ బద్ధంగా పాటించ గలిగితే పిల్లలు ఉన్నత శిఖరాలకు చేర్చటంలో ఏ మాత్రం సందేహం ఉండదు.







## విద్యార్ధులారా జీవితంలో ఎన్నటికీ వీటిని చేయకండి

ప్రియమైన విద్యార్ధులారా మీరు మీ జీవితంలో ఎన్నటికీ చేయకూడని పనులను గురించి తెలుసుకుందాము. అత్యంత చిన్న విషయాలుగా కనిపించే చేయకూడని పనులను మనం చిన్న తనంలో తమాషాగాచేస్తాము. మనం తమాషా చేసిన ఈ చిన్న తప్పులే కొన్ని సార్లు మన జీవతానికి దిశా నిర్ధేశాలు అవుతాయి. చిన్నతనంలో అలవాట్లుగా నేర్పించిన పొరపాట్లు ఆ వ్యక్తి జీవితంతోపాటు కుటుంబం మొత్తాన్ని కభలిస్తుంది. చిన్నతనంలోనేర్చిన సంస్కారాలే పెద్దవారు అయిన తరువాత వారిలో ప్రస్తుటిస్తాయి. చిన్న తనంలో చెప్పె అబద్ధాలు ఇంట్లో చేసే చిన్నపాటి దొంగతనాలు, ఇతరులపై చెప్పె సాడీలు, కొంత మంది బంధువుల పట్ల చూపించే ద్వేషాలు, పెద్దవారితో మర్యాధగామాట్లాడక పోవడం, తోటి వారిని చులకనగా చూడడం, ఉపాధ్యాయుల పట్ల గౌరవం లేక పోవడం, పెద్దల విషయాలలో అనవసరంగా జోక్యం చేసుకోవడం, భగవంతునిపై భక్తిలేక పోవడం, ఆపదలో ఉన్నవారిని ఆదుకోలేకపోవడం, కష్టాలలో ఉన్న వారిపై కరుణ చూపకపోవడం, ఇంట్లో పెద్దలు చెప్పిన పనులుచేయకపోవడం, చెడు స్నేహాలు చేయడం, చదువుపై శ్రద్ధలేకపోవడం, ఆరోగ్యం పై అశ్రద్ధ వహించడం, చీటికి, మాటికి చికాకు పడడం, నన్ను మించినవారు లేరు అని గర్వపడడం, అందరితో మర్యాధగా నడుచుకోలేక పోవడం, చెడు విషయాలపై ఆశక్తి చూపడం, ప్రతి విషయాన్ని అధైర్య పడడం, అన్నీ విషయాలలో క్రమశిక్షణ లేకపోవడం,

మన స్థాయికి మించి నడుచుకోవడం లాంటివి మీ జీవితంలో ఎన్నటికీ చేయకండి, ఇవి చేయడం ద్వారా అవి మీ మనస్సులో నాటుకొని అవి మీ జీవితంలో భాగమై మిమ్మల్ని సమాజంలో ఒక ప్రత్యేకమైన స్వల్పస్థాయి వ్యక్తిగా చేస్తాయి. వీటికి దూరంగా ఉండి ఉన్నత లక్ష్యాలు ఉన్న వ్యక్తిగా జీవించండి. అన్ని మంచే జరుగుతాయి.







## పరీక్షల్లో ఎక్కువ మార్కులు సంపాదించాలి అంటే

ఎంత చదివినా పరీక్షలో మార్కులు తగ్గుతున్నాయి అనే విషయం ప్రతి విద్యార్థిని ప్రతి రోజు బాధించే అతి ముఖ్యమైన విషయం తల్లిదండ్రులు తమ పిల్లలు మంచి మార్కులు సాధించాలి అనే కోణంలో డబ్బులు బాగా ఖర్చుచేసి పెద్దపెద్ద కాలేజిలు,స్కూలల్లో చదివిస్తుంటారు. విద్యార్థులు కూడా తల్లిదండ్రుల కోర్కెను తీర్చాలి అనే ఉద్దేశంతో బాగా కష్టపడి చదువుతుంటారు. కాని పరీక్ష ఫలితాల్లో మాత్రం ఇటు విద్యార్థులకు, అటు తల్లిదండ్రులకు నిరాసే మిగులుతుంది. దానికి కారనం చూస్తే విద్యార్థులు కష్టపడి చదవటం అనే విషయం వాస్తవం,కాని ఫలితాలు మాత్రం శూన్యం, ఎందువలన ఇలా జరుగుతుంది. అని మనం గమనించాలి. మొదట వ్యక్తిగత నైపుణ్యాలను, సామర్థ్యాలను తెలుసుకొని వారికి తగినట్టు లక్ష్యాలను నిర్దేశించాలి. అలా కాకుండా అధిక భారాన్ని, అధిక లక్ష్యాలను అధిక ఒత్తిడిని,కల్పించటం ద్వారా, విద్యార్థులు ఎక్కువ సమయం చదువుతారేగాని, సబెక్ట్ పై విషయ పరిజ్ఞానాన్ని కోల్పోతారు. విషయ పరిజ్ఞానం లేని విధ్య తాత్కాలికంగా మన మెదడులో ఉంటుంది గాని శాశ్వతంగా ఉండదు. అంతే కాకుండా విద్యార్థుల పైన ఉపాధ్యాయుల ఒత్తిడి, తోటి విద్యార్థులతో ఆహ్లాదాకరమైన వాతా వరణం లేకపోవటం, శక్తికి మించి పనిచేస్తున్నాననే భావన, నేర్చుకున్న విషయాలు వస్తాయో రావో అనే ఆలోచన, చదివిన విషయాలు పరీక్షల సమయంలో గుర్తుకు

రావని సందేహం, అపజయం కలుగుతుందేమో అనే భయాలు ప్రభావం చూపిస్తుంటాయి. వీటి వలన వచ్చే విజయాలు కూడా వెనుతిరుగుతాయి. అందువలన విద్యార్థులు తాము చేసే పనిమీద పూర్తి స్థాయి నమ్మకాన్ని కలిగి సబ్జెక్ట్ విషయంలో ఎటువంటి సందేహాలకు తావు ఇవ్వకుండా, సందేహ నివృత్తిచేసుకొని,మనలో ఉండే చిన్న చిన్న లోపాలు సరిచేసుకొని చదివే అంశాలను ఏకాగ్రతతో మొదడు అంతరాలలోకి తీసుకొని వెలితే ఇక విజయం మీదే, ఇటువంటి విజయాలను ఆపటానికి ఎటువంటి శక్తులు పనిచేయవు, మీరు పట్టిందల్లా బంగారమే అవుతుంది. చరిత్రలో అపజయాలు అనేమాట వినపడనే వినపడదు. మన ఏకాగ్రతని చెల్లా చెదురు చేసే కొన్ని రకాల వైరస్‌లు ఉంటాయి. అటువంటి వైరస్ మీ దరకిచేరాటనికినిరంతరం ప్రయత్నిస్తుంటాయి. వైరస్‌లు కొంత అహ్లాదాన్ని, సంతోషాన్ని, మానసిక ఉల్లాసాన్ని ఇవ్వ టంతో పాటు మనల్ని వాటి వైపుకి బానిసలుగా చేసకుంటాయి.

అందువలన మనం ఆ వైరస్‌ల నుంచి ఉపయోగపడే ఆహ్లాదాన్ని, సంతోషాన్ని, మానసిక ఉల్లాసాన్ని మాత్రమే తీసుకొని, మనకు కీడుచేసే అంశాలను దూరంగా ఉంచాలి. ఏకాగ్రతని పెంచుకోవటానికి ధ్యానం 'యోగా' వ్యాయామాలు చేయటం మంచిది. జీవితంలో గొప్ప స్థితికి రావటానికి అవకాశం ఉంటుంది.







# జీవితాన్ని సుఖమయం చేసుకోండి

ఏదో తెలియని బాధ అశాంతి, విచారం, ఒత్తిడి, చికాకు, దు:ఖం, అలజడి, ఆవేశం వంటి వీటిలో ఏదో ఒక దానితోనైనా ప్రతి వ్యక్తి ప్రతి రోజు గడపుతూ ఉంటారు. పై విషయాలు చాలా స్వల్పమైన విషయాలు వాటిగురించి ఆలోచించవలసిన విషయం ఏముందిలే అనుకుంటే పొరపాటే. ఏ వ్యక్తి అయితే సమస్యల వలయంలో చిక్కుకుంటాడో ఆ వ్యక్తిని పైన చెప్పిన విషయాలు పట్టి పీడిస్తుంటాయి. కొన్ని సమస్యలు అనేవి వాటంతల అవి వచ్చేవి, మరికొన్ని సమస్యలు మనం చేతులారా తెచ్చుకునేవి. మనం తెచ్చుకునే సమస్యలే ఎక్కువగా కృంగతీస్తాయి. సమస్య పుట్టిందంటే పరిష్కారం పుట్టేఉంటుంది. జ్ఞానంతో సమ్యలకు పరిష్కారం కనుగోనవచ్చు కొంత మంది వ్యక్తులు మూర్ఖ భావాలతో జీవిస్తుంటారు. వీరు నిరంతరం వాళ్ళకై వాళ్ళను దూషించుకుంటు కుటుంబ సభ్యులను దూషిస్తు సమాజాన్ని సైతం దూషిస్తుంటారు. వీరి దృష్టిలో ఒక వ్యక్తి చెడిపోవటానికి కారణం సమాజం అని అంటారు. మనం ఒక విషయాన్ని గమనించాలి. వ్యక్తుల సమూహమే సమాజం, ఎప్పటికీ సమాజం చెడ్డది కాదు అని గమనించాలి. ఈ అద్భుతమైన ప్రపంచం నీకోసం వేచిఉంది ఇక నీదే ఆలశ్యం, ఒక నిమిషమైన వృదా చేయక ముందుకు అడుగై నీకు కావలసింది అందేవరకు ఆగక.... అలుపెరగక పయనించు. నీ లక్ష్యం

చేరే వరకు ఈ సృష్టిలో నీవు సాదించలేనిదంటూ ఏవీ లేదు. నీలోని అజ్ఞానపు మైకమును నీ నుంచి తరిమేయి. జ్ఞాన కాంతిలో అన్వేషించు దొరుకుతుంది దివ్య మార్గం ఆ మార్గములోనే ప్రయాణించు అది నిన్ను ప్రపంచ ప్రసిద్ధి చేస్తుంది. ఎవ్వరూ ఊహించని రీతిలో నీవు ఉంటావు.

తన వల్ల కుటుంబానికి జరిగే ప్రతి నష్టం తనదేనని గ్రహించాలి. తల్లిదండ్రులను అగౌరపరిచిన,బాధకు గురిచేసినా దాని ఫలితం తానే అనుభవించాలని గ్రహించాలి. స్నేహితుల వల్ల చెడుమార్గాలలో ఉన్నానని అనిపిస్తే తక్షణమే అటువంటి స్నేహాలని అపివేయాలి. తల్లిదండ్రులతో ప్రేమగా వ్యవహరించాలి. ఏ తల్లిదండ్రులైనా తమ పిల్లల నుంచి ఆశించేది కేవలం ప్రేమ మాత్రమే అటువంటి కలుషితం లేని ప్రేమను అందించవలసిన బాధ్యత ప్రతి వ్యక్తిపైన ఉంటుంది. ఒక వేళ ఆవేశంలో తల్లిదండ్రులను ఎదిరిస్తే వెంటనే క్షమాపణలు పొందండి. ఇకపై ఆ తప్పు ఎన్నటికీచేయకండీ ప్రతి వ్యక్తి తన తల్లిదండ్రులకు ఇచ్చే నిజమైనబహుమతి తను ఉన్నత స్థాయిలో ఉండటమే. ఈ ఆధునిక సమాజంలో తల్లిదండ్రులతో పిల్లల సంబందాలు బాగా సన్నగిల్లాయి. ఈ బంధాలు గట్టిపడాలంటే మన పూర్వికులు వెళ్ళిన మార్గంలో మనం వెళ్ళాలి.







## విజయాలు వరిస్తాయి

జీవితంలో ఏదైనా సాధించాలని అనుకున్నారా! అయితే ఇక ఆలస్యం చేయకండి.ప్రారంభించండి మీకు అసాధ్యమంటూ ఏదీ లేదు. నిర్లక్ష్యం చేయకండి ఇక ఈ అవకాశం రాదు. మీ చేతులు, మీ ఆలోచనలు, మీ భావాలన్ని ఆ లక్ష్యంమీదనే
ఉంచండి. మీ శ్వాస, మీ ద్యాస అంతా అదే అయి ఉండాలి. మీరు అనుకున్న పనికి ఎన్ని ఆటంకాలు వచ్చిన ఆపకండి మీరు మీ లక్ష్యాన్ని చేరుకోవాలి. మీ లక్ష్యానికి ఆటంకము కలిగిచే విషయాలు ఏదైనా సరే వదిలివేయండి అవి అన్నీ మిమ్ముల్ని బలహీనులుగా చేస్తాయి. మీ లక్ష్యమే మిమ్ముల్ని బలవంతునిగా చేస్తాయి. మీరు విజయం సాధించారా ఇక తిరుగులేదు మీ కంటూ చరిత్రలో ఒక స్థానం ఉంటుంది. మీరు ఎంచుకునే లక్ష్యాలు మీ జీవితాలన్నే మార్చే విధంగా ఉండాలి. యావత్ ప్రపంచానికి ఉపయోగపడాలి.

ఇక ఆలస్యం చేయకండి ఎంచుకోండి అద్భుతమైన లక్ష్యాలను ఎంచుకోండి పోరాడండి. శ్వాస ఉన్నంత వరకు ఈ ప్రపంచంలో అసాధ్యం అనే పదం మీ జీవితంలో కనిపించకూడదు. విజయాలు మీకు బానిసలవుతాయి. ఎప్పుడు కుడా నేను ఈ పనినిచేయలేను అని అనకండి మీరు చేయగలరు. ఖచ్చితంగా చేయగలరు. ఒక్క క్షణం ఆలోచించండి. కేవలం మీ శక్తిని మీరు తెలుసుకోలేక మేము చేయలేము

మా వళ్ళ కాదు అని అంటుంటారు. ఒక్కసారి మీలోని శక్తిని తెలుసుకుంటే ఇక మీకు తిరుగులేదు, పోటీలకు భయపడకండి, ఒక విజయం సాధించాలంటే దానికి గల మార్గాలు వెతకడమే అది ఏదైన సరే నావల్ల ఏమి కాదు అని అనుకుంటే మనం ఇప్పుడు ఆది మానవులలాగానే ఉండేవారు చరిత్రలో ప్రతి మనిషి నేనుకూడా ఏదైనా సాధించగలను అని అనుకోనబట్టే నేడు ప్రపంచం మొత్తం విజ్ఞానమయమైంది. మీరు ఎట్టి పరిస్థితుల్లో సాధరణ మానవుడిలా జీవించకండి. అలా అందరు చేసేదే పుట్టడం , పెరగడం, మరణించడం వీళ్ళకు చరిత్రలో ప్రత్యేక స్థానం లేదు కొత్తగా ఆలోచించండి నూతన భావాలకు తెరదీయండి కొత్త వరవడని సృష్టించండి ప్రతిదీ పరిశీలించండి,ప్రసాదించండి చాలు ఇక మీ జీవితం మారినట్టే

మన బావాలను అర్ధం పర్ధంలేని వాగుడని కొందరు అనవచ్చు బయటపడకండి మీ భావాలను గుర్తించే వారిముందే ప్రకంటించండి అల్పుల దగ్గర మాట్లాడకండి మన ప్రతిభకు గుర్తింపు ఉండదు.







# జీవిత ఆశయం

ప్రతి వ్యక్తి తన జీవితంలో ఎన్నో ఆశలు, ఆశయాలతో జీవనం కొనసాగిస్తుంటారు. కొంతమంది కోరికలు వ్యక్తిగతమైనవి అయితే మరికొంత మంది కోరికలు సమాజ శ్రేయస్సుకు ఉపయోగపడేవిగా ఉంటాయి. వ్యక్తి తన కోరికలను నెరవేర్చుకోవటానికి నిరంతరం శ్రమచేస్తూ ఉంటాడు.

కొన్ని వేల సం||ల క్రితమే ఈ ప్రపంచానికి వైద్యాన్ని దాని మూలాలను అంధించిన మన భారత దేశం ఈనాడు అత్యాధునిక వైద్యం అందుబాటులోకి వచ్చినా కూడా నేటికి సగటుమనిషికి సరైన వైద్యం లభించక ప్రాణాలు వదలవలసి వస్తుంది. కొన్ని కోట్ల మంది భారతీయులు తెలియని వ్యాధులతో జీవిత కాలం రోగులుగా జీవిస్తున్నారు. శరీరంలో వచ్చే నొప్పులకు ఎన్ని మందులు వాడినా ఫలితం మాత్రం శూన్యంగానే ఉంటుంది. ఇలా ఏ జబ్బుకు పరిష్కారం దొరకటం లేదు ఇక పేదవాడి రోగానికి మందేలేదు. హాస్పటల్ మెట్లు ఎక్కాలంటే గుండె బద్ధలవుతుందేమో అన్న భయంతో రోగాలు దాచుకుంటూ మంచానికే పరిమిత ం అవుతున్నారు.

ఇటువంటి బాధకార దృశ్యాలు చూసిన తర్వాత మనస్సున్న ఏ మనిషికైన మార్పురావాలన్ని అనుకుంటారు. ఈ దేశంలో 'ఏ మనిషి' అనారోగ్యంలో మంచం పట్టరాదు, ఒకవేల అనారోగ్యం పాలైనా, అది ఎంతటి జబ్బు అయినా సరే, అమెరికాలో అందే వైద్యం అయినా సరే ఒక్క రూపాయి కూడా లేకుండా ప్రతిపేదవాడికి వైధ్యం అందాలి. ఏ ఒక్కరు కూడా డబ్బులేక వైద్యానికి దూరం కాకూడదు. అంతర్జాతీయ స్థాయిలో అమెరికా అధ్యక్షుడికి, బ్రిటన్ రాణికి అందే వైద్యం నాభారత దేశంలో ప్రతి ఒక్కరికి ఒక్క పైసా ఖర్చులేకుండా అందించాలన్నదే నా ఆశయము. ఈ ఆశయము చాలా కష్టమైన పని అనుకోవటం పొరపాటే. ఈ ప్రపంచంలో కష్టపడితే సాధించలేనిది ఏదీలేదు. ఇందుకు మీరందరూ సహకరిస్తే అతి తక్కువ కాలంలోనే మీ ముందుకు ఈ వైద్యాన్ని తీసుకురావాలన్నది నా జీవిత ఆశయం.